# సమరస గ్రంథమాల,
## మంగళగిరి.

సాహిత్యము ద్వారా దేశములో సామరస్యము పెంపొందించు తలంపుతో ఈ గ్రంథమాలను నెలకొల్పినాము. ఉత్తమ గ్రంథకర్తల కథలు, నవలలు, నాటకములు, పద్యకావ్యములు మొదలగునవి ఈ గ్రంథమాల ద్వారా ఆంధ్రమహాజనులకు అందింపవలెనని యాశయము. భాషాభిమానులెల్లరు తోడ్పడి మా ఉద్యమమును ప్రోత్సహించకోరుచున్నాము.

మహారాజపోషకులు రు 500, రాజపోషకులు రు250, పోషకులు రు 125, అభిమానులు రు 65.

సమాలోచకవర్గము :

శ్రీ శ్రీ శ్రీ శివశంకరస్వామి వారు
శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి గారు, యం. ఎ.,
శ్రీ ప్రగడ కోటయ్య గారు, యం. ఎల్. ఎ.,
శ్రీ దామర్ల రమాకాంతరావు గారు, యం. ఎ.,
శ్రీ ప్రగడ బాలనాగు గారు

నిర్వాహకులు :

శ్రీ వుడతా వీరాస్వామి గారు
శ్రీ పొట్టి సుబ్రమణ్యం గారు
శ్రీ జొన్నాదుల రామారావు గారు

మేనేజరు:

సమరస గ్రంథమాల

## గ్రంథమాల సభ్యులు:

రాజపోషకులు రు 250 ఇచ్చినవారు

మంగళగిరి మాష్టరు వీవర్సు అసోసియేషన్ వారు

పోషకులు రు 125 ఇచ్చినవారు

శ్రీ అంకం అంకయ్యగారు
శ్రీ ప్రెగడ అంజయ్య అండ్ బ్రదర్సువారు
శ్రీ వెనిగండ్ళ తాతయ్యగారు
శ్రీ దొడ్డాకుల పద్మనాభయ్యగారు

అభిమానులు రు 65 ఇచ్చినవారు

శ్రీ వుడతా వీరాస్వామిగారు
శ్రీ పొట్టి సుబ్రమణ్యంగారు
శ్రీ ప్రెగడ నరసింహం అండ్ సన్సువారు

# పీఠిక

ఈ కథాసంపుటికర్త శ్రీ అందే నారాయణస్వామి గారు. ఈయన కథారచనలో నందెవేసిన చేయి యని చెప్పవచ్చును. ఇదివరకే ఈయన రెండు మూడు కథా సంపుటములు వ్రాసి ప్రకటించినాఁడు. ఈ కథలయందు వైవిధ్యమున్నది. రచనా సౌభాగ్య మున్నది. వాడుకభాష లోని మెలపులున్నవి. భావసంపత్తి యున్నది. తెనుఁగు జీవితముయొక్క — అందులోఁ ప్రధానముగాఁ బల్లెటూరి జీవితపురహస్య మున్నది. చిన్నకథలు వ్రాయు శిల్పమున్నది. కథాసాహిత్యమునకుఁ గావలసిన సర్వలక్షణము లున్నవి. జీవితములోనున్న యిక్కట్లు, హాస్యరసము మానవుల కష్ట సుఖములు - ఒకటి యేమిటి - యెన్నో యున్నవి. ఈయ నను గురించి యొక్కమాట చెప్పవలయును. ఆంధ్ర కథా రచనలో నీయన 'మపాసా' వంటివాడు.

మొదటికథ 'స్నేహితుఁడు.' యదార్థమైన స్నేహితుఁ డెట్లుండునో, తన స్నేహితుఁడు పట్టుఁదల మనిసి యైనను వాని స్నేహమున కెట్లు భంగముండదో యీ కథలోని విషయము. పల్లెలలోని పట్టుదలలు, కక్షలు నిజమైన స్నేహ మున కెట్లు భంగకారులో శాంతి జీవితమునకు నేటి పల్లె టూళ్ళ సంఘపరిస్థితి యెంత విప్లవహేతువో యీ కథ యందు నిరూపింపబడినది.

రెండవకథ 'గాలిలో దీపము.' ఒక పేదరైతు. రాచఱికమువారు దున్నినవానిదే పొలమన్నారు. ఇది పైకి గొప్ప సిద్ధాంతమువలెఁ గనిపించును. కాని యల్పాల్పజీవితములమీద నిది యెట్లు దెబ్బకొట్టుచున్నదో దీనియందు నిరూపిత మగుచున్నది.

మూడవది 'వ్యత్యాసాలు' ఇది ధనవంతుల హృదయము లేనితనమును నిరూపించు కథ.

'చేతులుకాలాక ఆకులు' నాల్గవకథ. లోకములో జనము తమ ధనమును వదలికొనలేరు. ధనమున్నఁగాని కుల గౌరవములు లేవు. ధనము వదలలేరుగాని కులగౌరవములు నిలువవలయును. తమ బంధువులు దుర్వృత్తి చేయరాదు. తాను వారికి దమ్మిడీ సాయముచేయఁడు. కుటుంబములలో నిరాధారముగా నున్న జీవి కుటుంబములోనున్న యధికారుల దౌర్జన్యమున కెంత గురియగునో యీ కథయందున్నది. జనమునకు బుద్ధిలేదు. ఆలోచన లేదు. దాని వలనఁ గుటుంబ పరిస్థితులు తారుమారగుచుండును. చేయి దాటిపోయిన తరువాతఁ బ్రతివాఁడు నేడ్చెడివాడే. ఏడ్వక పోయినచోఁ గోపము తెచ్చికొనును. మొదటివానికన్న రెండవవాఁ డధముఁడు.

ఐదవకథ 'శిల్పి'. ఈ గ్రంథకర్తది మంగళగిరి. మంగళగిరి పద్మశాలి కుటుంబములకు ప్రధానస్థానము. ధనవంతు లుందురు. పేదవా రుందురు. ఇదియొక గొప్ప నేతపని

వాని కష్టకథ. లోకములో శిల్పియనుపేరం గథలు చాల నున్నవి. ఆ శిల్పి ఱాతి చెక్కడమువాఁడు. కుంచెపనివాఁడు. నేతగాఁడు కాదు. నేతగాని తనములో శిల్పమున్నది. ఈయన శిల్పియని పేరుపెట్టి గొప్ప పనివాఁడైన నేతగాని కష్టములు వ్రాయుటయే యొక గొప్ప విషయము. పడుగు దొరుకదు. రాచరికమువారు శ్రద్ధ తీసికొనుట లేదు. కాంగ్రెసుసంఘ సభ్యుడును జేయునది లేదు. రాచరికము వారికి వస్త్రపరిశ్రమను గుఱించి యాలోచన లేనితనము. ఈ దృశమైన యెన్ని శిల్పులయొక్క కుటుంబములకు దుఃఖ హేతువగుచున్నదో యీ కథయందు నిరూపింపఁబడినది.

ఆరవకథ 'కొత్తమేడ.' ధనము లేనివారి శీలము విచారణీయము. నింద్యము. ధనమున్నవాని శీలమునుగూర్చి విచారణమే లేదు. ఇంటిలోఁ గూతురు సంగీతము పాడినచోఁ దప్పు. ఆమె తండ్రికి, నన్నకుఁ దెలియకుండఁబోయి సినిమా తారయై ధనమార్జించినచో నామె సంపాదించిన మోటారు కారులపై తిరుగుటకు జనమునకు సిగ్గయిన లేదు. మరియాద లేని లోకము ధనము వెంటబడి యెటుపోవుచున్నదో యీ కథ నిరూపించుచున్నది.

'నువ్వు కాదు' అన్నది తరువాతికథ. రైతు పశువుమీద నాధారపడి బ్రతుకుచున్నాడు. వాని కా జ్ఞానము లేదు. దానిని మేపఁడు. రామభజనలు చేయును. ప్రాణులయందు దయలేని భగవద్భక్తి భగవద్భక్తి కాదు.

అది యజ్ఞతా లక్షణము. ఈ కథలో ఎద్దుభాష యున్నది ఆ బక్కచిక్కియున్న యెద్దుయొక్క కన్నుల చూపులు వ్యాఖ్యాతములైనవి. ఇది యారోపిత విషయమో, యాథార్థ్యమో భగవంతునికి దెలియవలయును. ఆత్మ కలవానికేఁ దెలియవలయును.

తరువాతికథ 'జీవకారుణ్యము.' దయాగుణముయొక్క యర్థము బుద్ధిహీనుడైన మానవునకుఁ దెలియుటలేదు. ఒక వైపున కబేళాలకు లక్షలు వ్యయపఱచుచు గోవధ నిషేధము చేయలేక బుద్ధ జయంతులు చేయుచున్నట్లు మార్వాడీ తాను వేయి అప్పిచ్చి దాని మింజుమలె పదివేలు తీసికొని యింకను వడ్డీబాపతు వేయి రావలయునని బాకీదారును చెఱసాలకుఁ బంపించుటలో వానికంటెఁ బరమ రాక్షసుఁడు వాఁడే. బోయవాఁడు పిట్టను బట్టుకొని చంపఁబోవుచున్నాఁడు పావలాయిచ్చి దానిని వదలించును. ఈ మానవులయొక్క దయాగుణము దయాగుణము కాదు. దీనిని యాసలో 'ఖయాలీ' యందురు. ఇంగ్లీషులో whim హ్విమ్ అందురు. మానవులకు ఏ గుణమును నిజముగాలేదు. ఒకానొక గుణము విచారణాజనితమై, సుష్ఠుగా నూహాశాలితతో నాచరణలో బెట్టవలసినదిగాని యేదో యెప్పుడో తోచినప్పుడు చేయుటగాదు. అట్టి పనులను సద్గుణములక్రింద లెక్కఁబెట్టుటకు వీలులేదు. ఈ మహావిషయ మీ కథాగత తాత్పర్యము.

తరువాతి కథ 'మడ్డిరకము'. ఈయన అన్ని రకముల వస్తువులను దీసికొని వ్రాయువాడు కనుక నీ వస్తువును దీసికొనెను. ఇందలి వస్తు వీయన మేధా విశేషమునకుఁ దగినది కాదు. కథావిషయము గొప్పదియో కొద్దియో దాని యందలి వైచిత్రి చూపించుటయే యీయన యుద్దేశము. కనుకనే యీయన 'మపాసా' వంటి వాడన్నది.

'సృష్టి లేడా' ఇది యొక చమత్కారమైన కథ. లోకములో నెవ్వఁడు తన భాగధేయమునకుఁ జింతింపరాదు. తన కెంత వ్రాసియున్నదో యంత సమకూడును. సొంతముగాఁ దెలివి తేటలు లేక పోయినను లోకమును జూచియైనను నేర్చికొన వచ్చును. ఇది రెండవ రకమైన తెలివి తేటలు.

చివరి కథ 'పుణ్యాత్మురాలు'. ఆధునిక కాలమున నొక కథలో నొక ముడియుండ వలయునని భావించుచున్నారు. ఆ భావనకు యోగ్యమైన కథ యిది. కథాగత విషయము జీవకారుణ్యము కథాగతవిషయము వంటిదే. కాని దీని ప్రత్యేకత ముడిలోనున్నది. అచ్చముగా నిది యాధునిక కథ

ఇంత వైవిధ్యము కథల యందుండుట కథకుని వివేకము, భావనాశక్తిని భాసింపఁ జేయును.

ఇందులో నీయన వ్రాసిన వాడుక భాష ముద్దులు కురిపించుచున్నది. పొలము రైతు వారు మాటాడుకొను ననేక శబ్దములు ఈ గ్రంథమునిండ నున్నవి. రైతు జీవితములోని రహస్యము లన్నియున్నవి. ఒక్కొక్కచోట రచన గొప్ప మార్గము నందున్నది. వానిని గూడఁ జూపించినచో పాఠకుని కథా పఠన సమయానుభూతికి లోపముచేసి నట్లగును. అందుచేత వ్రాయుట లేదు.

ఇందులోఁ బ్రకృతి పరిశీలన మున్నది. కొన్ని వాక్యములు అర్థసంగ్రహణ రమ్యములై యర్థపుష్టి కలిగియున్నవి. సర్వదా యీ కావ్యము రమణీయముగా నున్నది.

విజయవాడ
ది. 4–7–56

విశ్వనాథ సత్యనారాయణ

# స్నేహితుడు

పార్థసారథికీ, ముకుందానికీ విరోధం వచ్చిందన్న వార్త విని గ్రామస్థులు ఆశ్చర్యపడ్డారు. ఇద్దరూ ప్రాణస్నేహితులు. ఆఫీసువేళల్లో తప్ప వాళ్ళను ఒంటరిగా చూచిన వాళ్ళు వుండరు! లోగడ వాళ్ళ స్నేహాన్ని చూసి అసూయపడ్డ వాళ్లు కొందరు సంతోషించారుగూడా! ఇప్పుడు ఇద్దరికీ నోటిమాటలే కాకుండా కళ్ల చూపులుగూడా లేకుండా పోయినవి. ఇద్దరూ బజారులో తారసిల్లినా ఆమడదూరం తొలగిపోతున్నారు. పార్థసారథినీ. ముకుందాన్ని గూడా ఇంట్లో పెద్దవాళ్లు "ఒరే! మీరు బాల్యస్నేహితులు. ఒక కంచాన తిని ఒక మంచాన పండినవాళ్లు కదా, మీ కెందు కురా యీ విరోధం?" అని నూకలు వెయ్యకపోలేదు. "నే నేమీ అనలేదు. వాడే నాతో మాట్లాడడం లేదు" అని ఒకరూ, "నావల్ల తప్పేమీ లేదు. వాడే బిగుసుకు పొయ్యా" డని మరి ఒకరూ-యిట్లా యెవరిమటుకు వాళ్లు సమాధానాలు చెప్పారు. పెద్దవాళ్లు మందలించినా వాళ్ళ మనస్సులు మారలేదు.

ఆ గ్రామంలో రెండు పార్టీలు. రెంటికీ బద్ధవైరం. ఒక పార్టీవాళ్లు యేపని తలపెట్టినా (అది గ్రామానికి మేలు చేసేదిగాని, కీడు చేసేదిగాని) రెండో పార్టీవాళ్లు ప్రతిఘటించి

దాన్ని కాకుండా చెయ్యడమే వాళ్లపని. ముకుందం రెండో పార్టీలో చేరిపొయ్యాడు. వాళ్ళకు మరింత బలం చేకూరింది. ముకుందం పార్టీ వాళ్లు అవతలపార్టీ వాళ్లంటే ఒంటి కాలిమీద వెళ్ళడం మొదలు పెట్టారు. గ్రామరాశి రాములవారి కోవెల పూజాపునస్కారాలపట్ల రెండు పార్టీలకూ తగాదాలువచ్చి అదివరకే వ్యాజ్యాలుపడి గుడికి తాళాలు వేసుకున్నారు. ఒకరోజు సాయంత్రం కోవెల ఆవరణలో యెదిగివున్న గడ్డిని పార్థసారథిగారి పాలేరు కోస్తూ వుండగా అవతలి పార్టీ వాళ్లు వచ్చి కొడవలి. తట్ట లాక్కుని పాలేరును కొట్టి పంపారు. కొట్టడానికి వచ్చిన గుంపులో ముకుందం కూడా వున్నాడు. అప్పుడు పార్థసారథి అవతలి పార్టీలోని కొందరి పేర్లు చేర్చి చార్జి పెట్టాడు. అక్కడ విశేష మేమిటంటే! ముకుందాన్ని మాత్రం అందులో చేర్చలేదు. అందుకు పార్టీలో కొందరు పార్థసారథిని "ఏం మాజీస్నేహితుడనా అతణ్ణి చేర్చలే"దని దుయ్యపట్టారు. అందుకు అతడు వాళ్ళకిచ్చిన సమాధానం ఇది: "వాణ్ణి ఇటువంటి చచ్చు కేసుల్లో ఇరికిస్తే ఏం లాభం? గురిచూసి దెబ్బకొడితే ఇక యెప్పటికీ తలయెత్తకుండా వుండాలి. వాణ్ణి వదిలిపెట్టానని ఎంచవద్దు" అని.

ఇక ముకుందం వాళ్ళతో వీళ్ళతో "నా పేరు పెట్టడానికి వాడికి గుండె లెక్కడున్నాయి! మన మంటే వాడికి సింహస్వప్నం" అని చెప్పుకున్నాడు.

౨

ఆరు మాసాలు గడిచినవి. ముకుందానికి పార్టీ సంబంధమైన కక్షలు అట్లా వుండనిచ్చి మరి ఒక అవాంతరం వచ్చి పడ్డది. ముకుందానికీ పక్క ఇంటి ఆసామీకీ గోడ వరా కత్తు గోడదగ్గర తగాదా వచ్చి వ్యాజ్యాలు వేసుకోవడం దాకా జరిగింది. అవతలఆసామీ వున్నవాడు. ముకుందాన్ని లొంగ దీయడానికి ముకుందం అవతల మరిఒక ఆసామీకి బాకీవున్న నూటయాభై రూపాయల ప్రాంసరీనోటును ప్రతిఫలం యిచ్చి తన పేరటికి ఆర్డరు వేయించుకుని ముకుందానికి రిజిష్టరు నోటీసుగూడా ఇచ్చాడు. అయితే ఆరుమూరైనా ముకుందం ఒకళ్ళకు లొంగే ఘటం కాదు. ముకుందం పరిస్థితులు చూద్దామా! వున్నవాడేమీ కాడు. జీతంరాళ్ళవల్లనే జీవనం. అందులో అప్పో సప్పో చేసి గోడకేసులో కొంత ఖర్చు కూడా పడివున్నాడు. చేతిలో కాసీ లేదు. వెంటనే సొమ్ము చెల్లించకపోతే అతడు దావావేసి జప్తు తెచ్చి తనను పరాభవించేటందుకు సిద్ధంగా వున్నాడు. ఏ కాస్త లోటు కనిపించినా గోరంతలు కొండంతలుచేసి మనిషిని గేలిచెయ్యడానికి వేయి కళ్ళతో యెదురు చూస్తున్నది అవతలపార్టీ ఒకటి. తన మానాన్ని తాను గౌరవంగా జీవిస్తున్న అతని కది మనోవ్యథ కలిగించింది.

బాకీ చెల్లించి వేద్దామని అప్పుకోసం ప్రయత్నించాడు కాని యెక్కడా అప్పుపుట్టలేదు. పిచ్చివాడిలా తిరిగి

తిరిగివచ్చి ఈ ఆపదనుండి బయటపడే దెట్లాగా అన్న
విచారంతో ఇంటివసారాలో మంచానికి చేరగిలపడ్డ ముకుం
దానికి మెరుపులా ఒక ఊహ తట్టింది. తన అన్నకుమారుడు—
డాక్టరు—కాకినాడలో ప్రాక్టీసు పెట్టి, బాగా డబ్బు గడిస్తు
న్నాడు. అతను తానంటే ఎంతో ఆదరాభిమానాలు
కలవాడు. ఈ అవస్థంతా దేనికి, అతనికివ్రాసి డబ్బు
తెప్పించుకుందా మనుకొని ముకుందం వెంటనే కాగితం కలం
తీసుకొని ఏకాంతంగా కూర్చుని, ఇట్లా యిబ్బందిలో వున్నా
ననీ, ఓ నూటయాభై రూపాయలు పంపితే వెంటనే మళ్ళా
తీర్చి వేస్తాననీ, రెండుగంటలసేపు ఆలోచించి మూడు పేజీల
ఉత్తరంవ్రాసి కవరును స్వయంగా పోష్టులో వేసి వచ్చాడు.

కాకినాడకు ఉత్తరం వ్రాసి వారంరోజులయింది. తన
పేరటికి డబ్బు వస్తుందని వరసన మూడు రోజులనుంచి
ముకుందం పోష్టుకు వెళ్ళివస్తూన్నాడు గాని అంతవరకూ
ఏమీరాలేదు. ఆవాళ తప్పక డబ్బు వస్తుందన్న దృఢ
నిశ్చయంతో టపా వచ్చే వేళకు పోష్టాఫీసుకు వెళ్ళాడు.
ఆవాళకూడా ఏమీ రాలేదు. ముకుందం నిస్పృహతో ఇంటి
దారి పట్టాడు.

పెద్దబజారునే వెళ్ళిపోతూవున్న ముకుందానికి ఆటు
వైపే వస్తున్న పార్థసారథి కొంతదూరంలో కనిపించాడు.
ఆపదకూ వైరానికీ చాలాదూరం. అందులో వెనక ఇద్దరిలో
ఎవ్వరికి ఏ ఆపద వచ్చినా తమకు వచ్చినట్లు బాధపడుతూ

ఒకళ్ళని ఒకళ్లు అనుకున్న వాళ్ళు. ముకుందానికి పార్థసారథిని పలకరించాలన్న సంకల్పం ఉపయించింది. తీరా తాను పలకరించిన తర్వాత అతను పలకకపోతే తాను చిన్నపుచ్చుకో వలసి వస్తుందే! పోనీ, పలకకపోతే అతని మాట అతనికే వుంటుంది, తనమీద నెపము లేకుండా పలకరిద్దాం! ఇంత మాత్రానికి తనకు వచ్చే నామోషీ ఏముంది–అన్న నిశ్చయానికి వచ్చాడు. అయితే ఏ నెపంమీద పలరించేటట్లు? మళ్ళా ఆలోచన పడ్డది. వేరే నెపం అతనికేమీ గోచరించ లేదు. 'ఏరా సారథీ, ఎక్కడికి వెళ్ళుతున్నావు?' అందా మనుకున్నాడు. అసలే విరోధంగా వుంటున్న వాడిని ఎప్పటి లాగా 'ఏరా' అనిపిలిస్తే ఏంకోపం వస్తుందో! అట్లాగూడా కాదు. 'ఏం సారథీ! ఎక్కడికి వెళ్ళుతున్నావు?' అని మాత్రం పలకరిద్దామని తీర్మానించుకున్నాడు.

పార్థసారథి దాపులోకి వచ్చేశాడు. ముకుందాన్ని సమీపించాడుగూడ. తీరా అతడు సమీపించేసరికి ముకుందానికి నేరం చేసిన వాడిలా గుండెలు కొట్టుకొన్నవి. పార్థసారథికేసి కళ్ళప్పగించి వూరుకున్నాడు. మాట్లాడే టందుకు నోరు పెగల్లేదు. పార్థసారథి అతణ్ణి దాటి వెళ్ళి పోయ్యాడు. పాపం, ముకుందం నల్లెవేసుకున్నదంతా వృథా అయింది. అతడు దాటి పోవటంతో ముకుందానికి ఉక్రోషం ముంచుకొచ్చింది. తాను అతణ్ణి కలవేసుకునే తాహతు లేని వాడే కావచ్చు. అతడు మాత్రం తన నెందుకు పలక

రించకూడదు? అతనికి తాను చేసిన ద్రోహ మేమిటి? డబ్బుకలవాణ్ణి, పార్టీ బలంకలవాణ్ణి అన్న అహంకారం బలిసింది. వీడి డబ్బెంత చేసు, వీడెంత చేసు! అసలు చేస్తున్న దంతావీడే. అవతలవాడికి పుర్రట్లు పెట్టి మద్దత్తుగా వుండి కథ నడుపుతున్నదిగూడా వీడే. ఈఆలోచనలతో ముకుందం ఇల్లు చేరుకున్నాడు.

ముకుందం ఇక పోస్టుకు వెళ్ళడం మానివేశాడు. ఆ రెండో రోజున అతడు ఇంటిపంచలో దిగులుగా కూర్చుని వుండగా వీధి తలుపు నెట్టుకొని పోష్టుజవాను వచ్చి ఒక కవరు యిచ్చి వెళ్ళిపొయ్యాడు. ముకుందం ఆత్రంతో కవరు చించి కాగితాన్ని పైకి తీసి మడత విప్పాడు. అతని ఆశ్చర్యానికీ, ఆనందానికీ అంతులేదు. అది తాను వ్రాసిన ప్రాంసరీనోటే. డబ్బు ముట్టినట్టు వెనుక పీఠీన చెల్లు వ్రాయబడి, మెరుస్తూ ప్రక్కయింటి ఆసామీ సంతకంకూడా వున్నది. తన అన్నకుమారుడికి తానంటే ఎంత దయ! తాను సంగతులు, అన్ని వివరాలతో వ్రాసివుండడంవల్ల తన వాడు ఇక్కడి పరిస్థితులన్నీ శ్రద్ధతో గమనించి తన పేరటికి డబ్బు పంపి మళ్ళా తాను అవతల ఆసామీకి చెల్లించేలోపల అవతలవాడు తొందరపడి దావా వేస్తాడేమోనని తలచి నేరుగా వాడికే డబ్బు కట్టి స్వయంగా నోటు తెప్పించుకుని తనకు పంపివేశాడు. ఎంత దూరదృష్టి కలవాడు! ఇక ఆ వాజమ్మలు యెన్ని కుట్రలు పన్ని తన

నేం కదిలించగలరు? అయితే, దీనితోపాటు వుత్తరం ముక్కన్నా జతపరచలేదేం? అవును. ప్రొద్దస్తమానం వచ్చేవాళ్ళూ పొయ్యేవాళ్ళుగా తల్లో వెంట్రుకలంత మంది రోగులు వాణ్ణి వేపుకు తింటూవుంటారాయె. వ్రాసేటందుకు తీరిక యెక్క డుంటుంది? అయినా సజ్జనులకు ఇతరులకు సహాయపడడమే ముఖ్యలక్ష్యం. అట్లా చేశామనీ, ఇట్లా చేశామనీ యెన్నటికీ వారు వ్రాసుకోరు. ఇట్లా అనుకుని ముకుందం అప్పుడే కాగితం, కలం తీసుకుని—

"నా పరువు నిలబెట్టావు. నీమేలు ఎన్నటికీ మరిచి పోలేను. పరోపకారపరాయణులకు, స్వార్థత్యాగులకు మన భారతభూమి పుట్టినిల్లు. బిడ్డా! నిన్ను నేను పొగడగూడదు గాని నీబోటి పుత్రరత్నాలను గన్న భారతమాత ధన్యురాలు. పూర్వం మన ముత్తాతగారు గొప్ప గొప్ప త్యాగాలుచేసి ఆ తరంలో మన వంశానికి గొప్ప పేరు ప్రఖ్యాతులు తెచ్చాడని మా నాయనమ్మ చెపుతూవుండేది. పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. యీ తరంలో మన వంశానికి నీ మూలకంగా పేరు ప్రతిష్ఠలు రాగలవని నాకు చాల నమ్మకంగా వున్నది. భగవంతుడు నీకు ఆయురారోగ్యము లిచ్చి రక్షించుగాక."

తన పాండిత్యాన్నంతా గుప్పించి పై ధోరణిలో చేట భారతమంత ఉత్తరం వ్రాసి పోస్టులో వేశాడు. అందుకు

మూడో నాటికే జవాబు వచ్చింది. ముకుందం కవరు చించి చదవగా అందులో యిట్లా వున్నది :

"పూజ్యులైన చిన నాన్నగారికి, నమస్కారములు—

మీరు వ్రాసిన రెండు ఉత్తరములు చేరినవి. మీరు ముందుగా వ్రాసిన ప్రకారం డబ్బు పంపలేక పోయినందుకు మీరు నన్ను యద్దేవా చేస్తూ వ్రాసినందుకు చాలా విచార పడుతున్నాను. నేనంటే యెంతో వాత్సల్యంగల మీరు, మన స్తిమితంలో వుండి ఇట్లా వ్రాశారని నమ్మ లేకుండా వున్నాను. నేను యేమో వ్రాసినానని అశ్రద్ధ చేయక మీరు వెంటనే బయలుదేరివచ్చి నా చేత పరీక్ష చేయించుకోవలె నని మరీ మరీ కోరుతున్నాను."

ఉత్తరం చదువుకుని ముకుందం వెలవెలబోయాడు. తిక్కరావన్న ఇట్లా వ్రాశాడేం? అయితే డబ్బు ఎవరు కట్టినట్లు? తన అత్తవారు చూద్దామా, వాళ్ళదీ అంతంత మాత్రం సంసారమే! ఇక స్నేహితులని చూద్దామా, ముఖ్యమైనవాడే తనమీద కత్తికట్టె! ఆపదనుగుర్తించి తనకు అక్కరపడగలవాళ్ళెం కెవరున్నారు? అతనికి అగమ్య గోచరంగా వున్నది. పోనీ, తనకు డబ్బు యెలా చేరిందో ప్రక్కయింటి ఆసామీని యెవరిచేతనైనా అడిగించి అంతు తీయిద్దా మనుకుంటే అది అద్దెకొంప. ఇంటి యజమానిది మాత్రం దగ్గరగ్రామం. ఇంతలో తన మేనత్తకు చీటీ వ్రాసి పంపిన సంగతి అతనికి చప్పున జ్ఞప్తికి వచ్చింది. కాకినాడకు

వుత్తరం వ్రాసే నాటికి రెండు రోజులముందు ఆ వీధిలో యెవరో ఆ గ్రామం వెళుతూంటే కోనూరులో వున్న తన మేనత్తగారికి డబ్బు పంపమని ఆమె మాపేగా చీటీవ్రాసి పంపాడు. సొమ్ము ఆమె కట్టిందని ఇప్పుడతనికి అర్థమయింది.

## 3

తర్వాత రెండుమాసాలు గడచినవి. ముకుందం తగ్గే రకం కాదు. ఈ రెండుమాసాలబట్టీ ఇద్దరూ ఎన్నో సార్లు ఎదురుపడ్డా, ముకుందానికి పార్థసారథిని పలకరించాలన్న సంకల్పం ఆనాటితోనే అంతరించింది. రెండు పక్షాలకూ వైషమ్యాలు యథాప్రకారం నడచిపోతూనే వున్నవి.

ఆ రోజున గ్రామంలో ఒక గగ్గోలు బయలుదేరింది. ముకుందం క్రిందటిరోజు సాయంత్రం కాలవకట్టమీద ఒక అమ్మాయితో మాట్లాడిన మాట నిజమే. ఆ అమ్మాయి తెల్లవారేసరికి ఇంట్లో లేదు. గడచిన రోజు సాయంత్రం ఆ ఇద్దరూ కాలవకట్టమీద మాట్లాడుకుంటున్నప్పుడు ఎవరు చూశారో మరి-ఆ సంగతి కాస్తా గ్రామంలో వూదేశారు. పార్టీలువున్న గ్రామంలో ఇటువంటి వార్తలకు వడి జాస్తి. అది ఆనోటా ఆనోటా బడి ప్రొద్దు పొడిచేటప్పటికల్లా, ముకుందం ఫలానా అమ్మాయిని లేవతీసుకెళ్ళాడన్న వార్త గ్రామమంతా వ్యాపించింది. ఎవరినోటివెంట వచ్చినా అదే

మాట! ఏ వీథిలో చూసినా అదేముచ్చట! వీథి అరుగుల మీద నలుగురూ కూడడమూ——

"ఏమంటావ్, మాట తెలిసిందా?"

"అహా, తెల్లవారుఝామునే తెలిసింది"

"ముకుందాన్ని తెల్లవారి గ్రామంలో నేను చూశానే మరి!"

"అదంతా నాటకం లెండి. గ్రామంలో వుండి అందరి కళ్ళా పడితే తాను లేవతియ్యలేదనుకుంటారుగా!"

"అంతే అంతే, నిన్న సాయంత్రం ఇద్దరూ కాలవ కట్టమీద గుసగుసలు ఆడుకుంటూవుంటే కళ్ళారా చూసిన వాళ్ళుండగా అంతకంటే నిదర్శన మేం కావాలీ?"

"ఈ దెబ్బతో చూసుకోండి. నామాట నత్యమైతే, రెండుపార్టీలూ తలపడి తలకాయలు పగలగొట్టుకోకపోతే అప్పుడనండి."

"మీరన్నట్టు కొంపలంటుకునేటట్లేవున్నది. ఇందులో తీసిపొయ్యేవాళ్ళెవరూ లేరు."

——ఇట్లా గ్రామమంతా అట్టుడికినట్టుడికి పోతున్నది.

ఆ రోజు మధ్యాహ్నం పన్నెండింటికి మామూలు ప్రకారం ఇంటికి భోజనానికి నచ్చిన ముకుందాన్ని భార్య

"ఏమిటండీ, మీ మీద గ్రామంలో ఇట్లా వదంతి వున్న" దని ఆదుర్దాతో అడిగింది.

"అదా సంగతి! యిప్పుడు బజారునే వస్తూవుంటే అంతా నావంక అదోమాదిరిగా చూస్తున్నారు. ఏదో గుసగుసలాడుకుంటూన్నారు. ఎందుకో ననుకున్నాను" అన్నాడు ముకుందం.

"అంతా ఎరగనట్టు మాట్లాడతారేం, నిజం చెప్పండీ?"

"నాకేమీ తెలియదు"

"నా దగ్గర దాస్తారేం? పొరుగింటావిడ అంతా చెప్పింది. అదీ, మీరూ నిన్న కాలవకట్టమీద మాట్లాడుకోలేదా?"

"మాట్లాడిన మాట నిజమే"

"ఇంకేం, సంగనాచిలా మాట్లాడతారేం? ఇటువంటి వ్యవహారాల్లో కూడా దిగారూ!"

"అయితే ఏమని మాట్లాడామో విన్నావేం?"

"ఆడదానికీ, మగవాడికీ ఏం మాట లుంటవి? ఊరికే పుడుతుందా వదంతి?"

"వాళ్ళకు పుట్టిన పిచ్చి నీకూ పుట్టిందా? ఇదంతా అవతల పార్టీవాళ్లు చేస్తున్న దుష్ప్రచారం! నిన్న సాయంత్రం

నేను కాలవకట్టనే షికారు వెళ్ళి వస్తూన్నాను. ఆ అమ్మాయి రావిచెట్టుదగ్గర ఎదురుపడ్డది. చేతిలో కొడవలి వున్నది. నన్ను చూసి నిలబడి 'ఇటు ఎవరైనా వెళ్ళారా?' అని అడిగింది. అందుకు నేను 'నీకు ఎవరు కావాలీ? పేరు చెపితే చెపుతా' నన్నాను. అందుకు ఆ అమ్మాయి వెలా తెలా పోయి 'ఆడమనిషి' అన్నది. 'మగమనిషని ఎవ్వరన్నారూ' అన్నాను నేను. అంతటితో ఆ అమ్మాయి చరచరా వెళ్ళి పోయింది. ఇదీ మా యిద్దరికీ జరిగిన సంభాషణ,''

''ఇంతమాత్రానికే నటండీ గ్రామంలో మీ మీద అంత గగ్గోలు పుట్టింది?''

''చెప్పేదేమిటి'' ఇదంతా ఆ పార్థసారథిగాడు చేస్తున్న తతంగం. ఆ పిల్ల ఎట్లా పరారీ అయిందో అది నా మీదికి తిప్పారు.''

''ఎంత స్నేహానికి అంత విరోధమంటారే అట్లా వచ్చింది మీ ఇద్దరికీ. అయినా ఒకళ్ళతో మనకు విరోధం దేనికి చెప్పండి? మనం ఎంతటి వాళ్ళమని?''

''ఒక వేపున వాళ్ళు కయ్యానికి కాలు దువ్వుతూ వుంటే నన్నంటావేం? అయినా వాళ్ళు ఎన్నికుట్రలు పన్ని నన్నేం చేస్తారు?''

''అట్లా అనబోకండి. అవతలవాళ్లు డబ్బుకలవాళ్లు, మనం చూద్దామా అన్నంలో రాయి తీసుకోలేని వాళ్లం.''

"అయితే, ఏమంటావ్? డబ్బుంటే యెవడికెక్కువ?"

"డబ్బున్నవా ళ్ళేపనన్నా చెయ్యగలరు. గ్రామంలో చూస్తే గోలగావున్నది. మీరుమాత్రం బైటికికదలవద్దు."

"నిప్పు పట్టుకుంటే పొక్కుతుందా, లేకపోయినా పొక్కుతుందా? మనకేం భయం?"

"మీ రెప్పుడూ ఇంతే. ఎడదిడ్డమంటే పెడదిడ్డ మంటారు? అసలే పార్టీ కక్షలాయె! గ్రామంలో చూస్తే కొట్లాటలు జరుగుతవని పుకారుగా వున్నది! ఇల్లు కదల వద్దంటే నామాట వినరు" అని ఆమె పమిటచెంగుతో కళ్ళద్దుకుంటూ అన్నది.

"పిచ్చిదానిలా వున్నావు! నీకంత భయందేనికి? దేవుడు చాలా మేలుచేసి, వాళ్లు నామీదికి రావాలే కాని ఇవతల మనపార్టీ లేదూ. మక్కెలు విరగపొడిచి చంపు తారు, తెలిసిందా?"

భోజనం కాగానే ముకుందం పైమీద వుత్తరీయం వేసుకొని పార్టీవాళ్లు నలుగురి ఇళ్ళకూ వెళ్ళి ఈ వుదంత మంతా చెప్పి వచ్చినాడు.

ప్రొద్దు కూకింది. ముకుందం వసారాలో లాంతరు దగ్గిర కూర్చుని నిశ్చింతగా పత్రిక చదువుకుంటున్నాడు. ఇంతలో వాకిటిముందు గల్లంతు వినవచ్చింది. పరారీఅయిన పెల్లలరపువాళ్లు వుద్రేకంతో పదిమందికై కర్రలుపుచ్చుకుని

ముకుందం ఇంటిమీదికి వచ్చేశారు. వీధిగుమ్మంముందు
నిలబడి ముకుందాన్ని బైటికి రమ్మని కేకలు వేస్తున్నారు.
ముకుందంభార్య కంగారుకు అంతులేదు. ముకుందం వెంటనే
దొడ్డిగుమ్మంగుండా కుర్రవాడిని తన పార్టీవాళ్ళకోసం కబు
రిచ్చి పంపాడు.

వెళ్ళిన కుర్రవాడు వచ్చేశాడు. ఇంకా వాళ్లురాలేదు.
వాకిటిముందు వాళ్ళ కేకలు జాస్తీ అవుతున్నవి. "మీరు
బైటికి వెళ్ళవ" ద్దని భర్తను బతిమలాడుకుని, భార్య వీధి
గుమ్మంలోకి వెళ్ళి "ఎందుకు నాయనలారా! మా ఇంటి
మీదికి వచ్చారు? మే మేపాపమూ యెరగము. మీరు
వెళ్ళిపోండి" అని వాళ్ళతో చెప్పింది. "ఆడదాన్ని పంపి
తాను ఇంట్లో దూరాడా? బైటికి రమ్మను. కనపడుతుంది"
అంటూ వాళ్లు దుర్భాషలాడడం సాగించారు.

అప్పటికీ తన పార్టీవాళ్ళు రాలేదు. ఇంట్లో ముకుం
దానికి గాభరా అధికమైంది. పెద్దపులికి బాగా ఆకలివేస్తేనే
పంజా విప్పుతుంది! పార్టీ గూడా అంతే! సమిష్టిగా బయలు
దేరదగిన కారణం ఏర్పడితేనేగాని అది లేచి ఒళ్ళు విరుచు
కోదు! లేకపోతే గేదెను వేసిన పులిలా మత్తుగా పడుకొని
వూరుకుంటుంది! ముకుందం ఇంకా వాళ్ళు వస్తారన్న
నమ్మకంతోనే వున్నాడు. వాకిటిముందు వాళ్ళు చేస్తున్న
గోల మిన్నుముట్టుతున్నది. ముకుందానికి కాళ్ళు భూమి
మీద ఆనడంలేదు. ఇంకా తాను జాప్యంచేస్తే వాళ్ళు

ఇంట్లో జొరబడేటట్లున్నారు. ముకుందం ధైర్యంచేసి వీధి గుమ్మంలోకి వెళ్ళి "మీ రన్యాయంగా మా యింటిమీదికొచ్చి ఇట్లా గల్లంతు చేయడం దేనికి?" అన్నాడు.

అతని మాట ఆలకించే దెవరు? అతణ్ణి చూడగానే వాళ్ళకు వుద్రేకాలు హెచ్చిపోయినవి. నోటికి వచ్చినట్లల్లా తలోమాట మాట్లాడుతూ కర్రలు పైకెత్తారు. ముకుందం ఒక్కడూ ఏమి చేయగలడు? అతడు వణికి పోతున్నాడు. భార్య అతణ్ణి లోనికి తీసుకు వెళ్ళడానికి యత్నిస్తూవున్నది.

ఇంతలో "ఏయ్, ఆగండి. వాడిమీద గనక దెబ్బ పడ్డదా మీ పరువు దక్కదు." అని పెద్దకేక వినవచ్చింది. ముకుందానికి తన పార్టీ వాళ్లు వచ్చేస్తున్నారని ప్రాణం లేచి వచ్చింది. అంతా అటువైపు చూశారు. పార్థసారథి బాణా కర్ర పుచ్చుకొని వడివడిగా అక్కడకు వస్తున్నాడు. వాన కురిసి వెలిసినట్లు అంతా నిశ్శబ్దమయింది. ఎత్తిన కర్రలు అట్లాగే నిలిచిపోయినవి. పార్థసారథి వాళ్ళను సమీపించి "ఎందుకు మీ రన్యాయంగా వాడి ఇంటిమీదికి రావడం? వాడి సంగతి నాకు బాగా తెలుసు. మనిషి పెంకెవాడే కావచ్చు! వాడిదగ్గిర యిటువంటి చెడుబుద్ధులేమీ లేవు. మీ అమ్మాయినిగురించి వాడితరఫున నేను హామీ యిస్తున్నాను. పూరు వెళ్ళిపొండి" అన్నాడు. అంతటితో వాళ్ళు ముఖాలు వ్రేలాడ వేశారు.

పార్థసారథి అన్న మాటలకు ముకుందం తన చెవులను తాను నమ్మలేకపోయాడు. ఆనంద పారవశ్యంతో ముకుందం పార్థసారథి రెండు చేతులూ పట్టుకుని "నిన్ను అర్థంచేసుకో లేక పోయినందుకు సిగ్గుపడుతున్నారా సారథీ! ఆ రోజున నోటుకు డబ్బు చెల్లించింది కూడా నువ్వేనని ఇప్పుడు తెలుసు కున్నాను. నిన్ను అపార్థం చేసుకున్నందుకు నన్ను క్షమించు" అన్నాడు.

అప్పుడు పార్థసారథి "అయితే నీ తప్పుకు శిక్ష వేస్తున్నాను. యిప్పుడు నాతో మాయింటికి భోజనానికి రా రా!" అన్నాడు.



# గాలిలో దీపం

గోపయ్య కుప్ప నూడుస్తున్నాడు. పదిమంది కూలీలూ, తనూ, కలిసి వేకువఝాము ననంగా పనిలో వంగితే అప్పటికి పిడికట్ట కొట్టడం అయింది. ఒక రోజా! రెండు రోజులా! ఆరు మాసాల కష్టఫలితం అది. ఆ బల్ల చెక్కలకింద రాలిన గింజల రాసిని చూసుకుని ప్రసవవేదన పడిపడి బిడ్డను చూసుకున్న తల్లిలా మురిసి పోతున్నాడు.

అన్నాలు తిని పిడికట్ట కొట్టిన వరిగడ్డి పనలన్నీ బంతి తొక్కించడానికి కళ్ళంలో పరుస్తున్నారు. కూలీలను పుహారా చేస్తున్నాడు గోపయ్య. ఇంతలో తెల్లటి బట్టలూ, తెల్లటి నామాలూ ధరించి పద్మనాభయ్యగారు వచ్చారు. వెంట మోసుకు వచ్చిన కూలిమనిషి గోతాలకట్ట కిందికి దించాడు. పద్మనాభయ్యగారు పొలంకామందు. వారి పొలాన్నే గోపయ్య ముక్తాకు చేస్తున్నాడు. పద్మనాభయ్య గారి రాకచూసి గోపయ్య చేతిలోపని వదిలి ఆయన దగ్గరకు వెళ్ళి గోతాలకట్ట అవతలకుజరిపి ఆసనంచేసి ''కూర్చోండి'' అని మర్యాదచేశాడు. ఎండగా వుండడంవల్ల పద్మనాభయ్య గారు గొడుగు వేసుకుని గోతాలకట్టమీద ఆసీనులయ్యారు. పనలన్నీ కళ్ళంలో పర్చడం కాగా బసులు తెచ్చినవీ, తన సొంతం కలిపి పది పదిహేను పసువులకై బంతికట్టి కళ్ళం మీద తిప్పుతున్నాడు. దూరాన్నుంచి పొతేల్ గా అన్న

కేకలు సన్నగా వినవస్తున్నవి. అవతలగా నేల కలుగుల్లో ఎవరో కుర్రాడు పీతలు పడుతున్నాడు. కొంచెం అవతల కయ్యదగ్గిర కొంగ నిలుచుంది. కయ్యగట్టుమీది తుమ్మ చెట్టుకు గిజిగాడు ముక్కుతో గూడు కట్టుకుంటున్నది.

నలువైపులా యెటుచూసినా కనుచూపు మేరఅన్నీ కాళీపొలాలు, ఆకాళీపొలాల్లో అక్కడక్కడ వరికుప్పలూ, దూరాన యెక్కడో ఒకటిరెండు పొలాల్లో కుప్ప నూరుస్తున్న చాయలూ కనిపిస్తున్నవి. పద్మనాభయ్యగారు గొడుగుకింద కూచుని అంతా తిలకిస్తున్నారు.

బంతి తొక్కించటం పూర్తి అయి, ధాన్యం తూర్పారపట్టేవరకు ప్రొద్దు వాలింది. ధాన్యం కొలిచి గోతాలకు పట్టారు. పద్మనాభయ్యగారు తెచ్చిన గోతాలన్నీ ధాన్యంతో నిండిపోయినవి. ఎకరానికి పదమూడు బస్తాల కట్టుబడి. నాలుగు ఎకరాలకూ యాభైరెండు బస్తాలూ మూటలుకట్టి బళ్ళమీదికి యెత్తారు. గ్రామం అక్కడకు మైలుదూరం వుంటుంది. పద్మనాభయ్యగారు గొడుగు చంకన పెట్టుకుని బళ్ళవెంట వెళ్ళిపొయ్యారు.

పసిబిడ్డను చంకన వేసుకుని వచ్చిన స్త్రీ ఒకతె, కుంటివాడొకడూ కనిపెట్టుకుని కూర్చున్న యిద్దరు బిచ్చగాళ్ళకూ గోపయ్య చేటతో చెరికాశిని గింజలూ పెట్టాడు. యింతలో రైలుబండిని ప్లాటుఫారంమీద చూసిన ప్రయాణీకుడిలా వొప్పుకుంటూ, రొజుకుంటూ,

కోమటి గురవయ్య వచ్చాడు. గోపయ్య యీ కోమటిసెట్టి దగ్గర లోగడ పొలంలో కలుపు తియ్యడానికి చేతిలో తడిలేక బజారు ధరకంటే తక్కువకు రెండు బస్తాలు పంట కళ్ళాల్లో యిచ్చేటట్టు నిర్ణయించుకుని డబ్బు తెచ్చుకున్నాడు. గోపయ్య కోమటిసెట్టిని చూడగానే ఆ రెండు బస్తాలూ కొలిచి వప్పగించాడు. యిక కళ్ళంలో మిగిలిన గింజలు కొలవగా నాలుగు బస్తాలు అయినవి. చీకటి పడేటందుకు యెంతో వ్యవధి లేదు. ఆకాశంలో పక్షులు వరికంకులు ముక్కున కరుచుకుని గూళ్ళకు మళ్ళినవి. గోపయ్య కూలీలకు కూలికింద తలో అడ్డెడు గింజలూ పెట్టి మిగిలిన గింజలూ పిడికట్ట కొట్టిన చెక్కలూ బండిమీద వేసుకుని యింటికి బయలు దేరాడు.

౨

గోపయ్య యిల్లు చేరుకునేసరికి బాగా చీకటి పడ్డది. బండిమీదవి యింట్లో పడవేసి ఎడ్లను వదలి, పాకలో కట్టివేసి, గంగడోళ్ళమీది జోరీగలు దులిపి, వాటిముందు మేత వేశాడు. భార్య వేడినీళ్లు తెచ్చి బైట పెట్టగా గోపయ్య వెళ్ళి స్నానంచేస్తూ ''మా కోటమ్మ కూలి కెళ్ళి యింకా రాలేదంటే?'' అని భార్యను అడిగాడు.

"రాక అక్కడేం చేస్తది? యక్కడో బుర్రకథ చెప్తున్నారంట. పక్కింటామె పిలిచింది. యెళ్ళింది

గానాలు. ఎవరికి తెలుసు! ఎవరితో చెప్పింది!''
అని సమాధానం చెప్పింది భార్య.

"ఎందుకే అవంటే నువ్వట్లా కొరకొర లాడతావు? దానికి మనకంటే ఇంకాయనవరైనా వున్నారా?'' అన్నాడు గోపయ్య యథాలాపంగా.

"మీ అప్పగారు మంచిదే, నేనే చెడ్డదాన్ని, ఎనకేసు కొచ్చేందుకు నాకెవరున్నారు! మీరూ మీరూ ఒకటి'' అంటూ భార్య చర్రున లోపలికి వెళ్ళింది.

కోటమ్మ గోపయ్యయింట పడివున్న వెధవాడపడుచు. పనినా మరదళ్ళకు పడకపోవడంవల్ల కోటమ్మ కూలీ నాలీ చేసుకుంటూ వాళ్ళ యింట్లోనే ఒక చెంప కాచుకుతాగుతూ వున్నది.

గోపయ్య స్నానంచేసి భోజనంకానిచ్చి చుట్టకాల్చుకుంటూ వసారాలో కూర్చునేసరికి పక్కింటి రామసుబ్బయ్య వచ్చాడు. రావే "చిన్నయ్యా!'' అంటూ గోపయ్య అంకెం తెచ్చి పరిచాడు. రామసుబ్బయ్యకు డెబ్బైయేళ్లు వుంటవి. యిప్పటికీ శనగలు నమలగల దంతపుష్టి. మూడుపూటలూ తిని అరాయించుకోగల జీర్ణశక్తి. పొలంవెళ్ళి వ్యవసాయం చేస్తాడు. రాత్రి భోజనానంతరం వాళ్లు ఒకచోట కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకునే వాడుక,

"కుప్ప నూర్చావు కానూలు యెన్నిగింజలయినా రా గోపయ్యా ?" అని అడిగాడు రామసుబ్బయ్య.

"యెన్నైతే యేం సుకం లేవే, గట్టుకి కట్టెలు మోసినట్టు, మనకు మిగిలినై నాలుగు అంకేలు."

"అంతవరకి నయమనుకోరా. అసలు మిగలకపోతే యేం చేస్తావు ?"

"మా చిన్నయ్యాది కడుపునిండిన బేరం. పండిన గింజలన్నీ యింట్లో నచ్చిపడతంటే కనపడ్డంలా!" అన్నాడు గోపయ్య.

"అవున్రా. పొలం మక్తాకు చూస్తున్నప్పుడు పండినా పండకపోయినా పొలంవాళ్ళకి అనుకున్న ప్రకారం గింజలు కొలవ్వాలసిందేగా! మానెడు తక్కువ కొలిస్తే వూరు కుంటారా! అందులో లాబనష్టాలన్నీ మనయ్యి" అన్నాడు రామసుబ్బయ్య.

"అవుననుకోవే చిన్నయ్యా! మాకేమన్నా సొంత పొలాలా పాడా! యిదే ఆశాయె. చేసినకష్టానికి తగినన్ని మిగలకపోతే పానం వుసూరుమంటది."

"అవంతా మన ప్రాప్తంరా మేంగూడా గుంటూరు షావుకారుది రెండెకరాలు చూస్తున్నాంగా. నిరుడు యేమైం దనుకున్నావు. వాళ్ళకు కొలవ్వాలసిన మక్తాకంటే రెండు బస్తాలు తక్కువపండి యేడిసింది. వాళ్ళకు తక్కువకొలిస్తే

వుంటుకుంటూరా? యేం చాస్తాం! యింట్లోయి రెండు బస్తాలేసి వాళ్ళకు సరిపెట్టాం. జొన్న ముదిరిందని కోడవలి పారేస్తామా? మనంవొదులుకుంటేచేసేవోళ్లు బోలెడుమంది.''

''యట్లా వొదులుకుంటాం లేవే చిన్నయ్యా! వొదులుకుని మాబోటోళ్ళం యట్లా బతకాలి? రొండో పని యేమన్నా చేతనవుద్ది గనకనా!''

''అందుకనేరా వచ్చినదాంతో తృప్తిపడాలని చెపుతున్నది. చుట్ట ఆరిపోయింది. అగ్గిపెట్టె యివ్వరా?'' గోపయ్యా దీపంబుడ్డి తెచ్చిపట్టగా రామసుబ్బయ్యా చుట్ట వెలిగించాడు. గోపయ్య చేతిలోబుడ్డి కిందపెడుతూ అన్నాడు. ''యేంటీ కరువు చిన్నయ్యా? రూపాయి తీసికెళ్తే దోసిట్లోకి గింజలు రావయ్యో! యేనాడైనా నడ్లబస్తా ముప్పయి రూపాయలమ్మిందా! మీబోటి సొంతపొలాలు వున్నోళ్ళకి పరవాలేదనుకో, మా బోటి సన్నకారు మరీ చచ్చిపోతున్నది.''

''కరువని మెల్లిగా అంటావేందిరా! మొముకలు కొరికేస్తుంటే! పితపకాలం పితపబుద్దులు! యనక యీ కరువూ యీ రోగాలూ వున్నయ్యా! దానిదుంపతెగ పెతోళ్ళకి చయరోగమే! యనక దాతకరు వొచ్చినప్పుడు రూపాయికి నాలుగు మానికలు బియ్యం యిచ్చారంట! అప్పటికి అదీకరువే! నేను యరగను. మా నాయన చెపుతా వుండేవాడు, నాకు బాగా వుకొచ్చాక రూపాయికి

పదహారు మానికల జొన్నలు నేను మోసుకొచ్చాను. అప్పుడు అంతా జొన్నలేగా తినేది. పండగ పబ్బాలకూ, చుట్టం వచ్చినప్పుడూ బియ్యం తెచ్చి వొండేవాళ్లు'' అన్నాడు రామసుబ్బయ్య.

''ఆకాలం మళ్ళీ వస్తదంటే చిన్నయ్యా ?''

''కల్లోవార్త! ఆ కాలం యిక మనంచూడం రా! అప్పుడు ధర్మం మూడు పాదాలమీద నడిచేది. డబ్బు యిచ్చినా పుచ్చుకున్నా నోట్లుండేయా! ముప్పైఏళ్ళ వాడికి మూడేళ్ళపిల్ల! యిప్పుడో మోసాలూ, దగాలూ, పద్దెనిమిదేళ్ళకే సంతానం ఎత్తుతున్నారు.''

''వుండకొందికీ కాలం తిరగబడి పోతన్నదిలేవే చిన్నయ్యా! వడ్లమరలూ, కాఫీహోటల్లూ మనకూడా వచ్చినయ్యా!'' అని గోపయ్య, చెపుతూవుంటే రామ సుబ్బయ్య అడ్డువచ్చి, ''అయ్యోరా మనదుంప తెంపు తున్నయ్యి.'' అన్నాడు. ''వాటివల్ల వచ్చే చెడ్డగుణాలు అట్టావుంచు. వడ్లమరవచ్చి యంతమంది నోటికాడ తిండి పడగొట్టిందే చిన్నయ్యా! మా కోటమ్మ చచ్చిపోతున్న దంటే నమ్ము. అదివరకి దంపులోకిపొయ్యి సుకంగా బతికేది. యిప్పుడు యవరు దంపిస్తున్నారు'' అన్నాడు గోపయ్య.

''మీకోటమ్మ పకటేంపరా. వడ్లమర వచ్చాక యంత మంది జీవనాలు పడిపోయినై. గూడెంలో దంపువల్ల యంత

మంది బతికేవాళ్ళు. మా యింటో మానానికి అన్నివరకి ఆడంగులు వొళ్ళువంచి దంపుకునేవాళ్ళు. యిప్పుడు దంపుడూ లేదు. గింపూ లేదు. మంగళ్ళిచూసి ఎద్దు కుంటినట్లు వడ్లబస్తా పాలేరు నెత్తినపెట్టి మరకి పంపుతున్నారు. బద్దకం, సోమరితనం పెరిగిపోయినై.''

పత్రిక పట్టుకుని పంతులు వచ్చాడు. అతని అసలు పేరు, రమణయ్య. ప్రక్క బజారులో వీధి బడిపెట్టి పిల్లలకు చదువు చెప్తున్నాడు. గోపయ్యయింటిదగ్గరే వాళ్ళయిల్లు.

గోపయ్య ''రా! పంతులూ!'' అంటూ మరో అంకెం తెచ్చి పరచగా అతడు కూర్చున్నాడు.

గోపయ్య అన్నాడు. ''వడ్లమరోడికి ప్రాపిరాడ్డం లేదంట. వడ్లమరోడూ, కాఫీవోటలోడూ యేంపోసుకున్నా పోసుకుంటున్నారు.'' అని.

''యెందుకు పోసుకోరూ. మొన్న నేను పాలంనించి వస్తా చూశాను. యక్కడైనా పిల్లలు చిరుతిళ్ళు తింటారు గానీ, అందేదో! పెద్దవాళ్ళు కూచోని యెద్దుల్లాగా తింటన్నారు! మా రెంకోవాడు అంతవరికి మూడుపూటలా మూడు కాస్తలు అన్నం తినేవాడు. కాఫీవోటలు మరిగి ఆకలి మందగించి సరిగా అన్నం తింటం మానేశాడు. వాళ్ళ తల్లి గోలపెడతంద'' అన్నాడు రామసుబ్బయ్య.

పంతులు అన్నాడు. "మన వూరు సంగతేనా! కాఫీహోటళ్లూ, వడ్లమరలూ, సినిమాలూ మన గ్రామం బస్తీకంటే యేంతీసిపోయింది? ఒక్కదానిలో తప్ప!" అని.

"దేనిలో" అని అడిగాడు గోపయ్య.

"సంపదలో" అన్నాడు పంతులు.

"బలే మాటన్నావు పంతులూ"

"యనకటికి అన్ని లచ్చనాలూ బాగానే వున్నయ్ గాని అయిపోతనం తక్కువన్నాడంట" అని పూర్తి చేశాడు రామసుబ్బయ్య.

"పులిని చూసి నక్కవాత పెట్టుకున్నట్టు బస్తీనుంచి లాభకరమైనవి తప్ప నష్టదాయకమైన వన్నీ సుళువుగా దిగుమతి చేసుకున్నాం." అని పంతులు చెప్పుకుపోతుంటే గోపయ్య అడ్డువచ్చి "లాబకరమైనె అంటే యేంటి పంతులూ?" అని ప్రశ్నించాడు.

"వ్యాపారం గట్రా. సరియైన పాఠశాల వున్నదా అంటే అదీలేదు. కాఫీ హోటళ్ళూ, వడ్లమరలూ, సినిమాలూ వున్నప్పుడు హాస్పటలు కూడా తప్పక వుండాలి. వాటికీ హాస్పటలుకూ అవినాభావ సంబంధం! మరి హాస్పటలును దిగుమతి చేసుకోగలిగామా అంటేలేదు. లాభకరమైనవి మినహా అని ముందే చెప్పాగా. ఎలుకలు పెంపుచేసుకున్నవాడు పిల్లికోసం జాగ్రత్తపడాలి. యేకోన్ కిస్కాగాడిచేతో చికిత్స చేయించుకుంటే వుపకారంకంటే

అపకారమే జాస్తి. అందుకనే మన గ్రామాలు రోగాలతో తులతూగుతున్నవి '' అన్నాడు పంతులు.

'' నువ్వు చెప్పింది నిజం '' అన్నాడు గోపయ్య.

'' అందుకే సదువు మూణో నేత్రం అన్నారు. యిక పత్రిక సదివి యినిపించుపంతులు'' అన్నాడు రామసుబ్బయ్య.

గోపయ్య దీపంబుడ్డి దగ్గర పెట్టగా పంతులు పత్రిక చదవడం మొదలుపెట్టాడు. ''ఆచార్య వినోబాభావే వుత్తరాదిన, స్వామీ రామానందతీర్థ నైజాంలోనూ, శంకరరావు దేవ్ దక్షిణాదిన, భూదానయజ్ఞం చేస్తున్న విషయం, దున్నేవాడిదే భూమి అన్న నినాదాలను గురించి, యెక్కువ పంటను పండించి గవర్నమెంటు వారిచేత బహుమతులు పొందిన రైతులను గురించి మొదలైన విషయాలన్నీ, విపులంగా చదివి వినిపించాడు పంతులు. అవి వింటున్నంతసేపూ స్వప్నజగత్తులో విహరించాడు గోపయ్య.

'' పొద్దుపోయింది, బేతపూడి పొలంలో మిరప మొక్కలకి తెగులు పడ్డది. రేపు చీకటితో గుంటూరు పొయ్యి మందు తెచ్చి చల్లాలి '' అంటూ రామసుబ్బయ్య లేచి వెళ్ళిపొయ్యాడు. అంతటితో పత్రిక మడిచి పంతులు గూడా లేచాడు.

3

మర్నాడు ఉదయం గోపయ్య పొలంవెళ్ళి సగంగడ్డి అమ్మి, సగం గడ్డి గొడ్ల మేతకు యింటికి చేరుద్దామని అనుకుంటూ వుండగా పద్మనాభయ్యగారి నౌకరువచ్చి, "అయ్యగారు నిన్ను సవారిబండి కట్టుక రమ్మన్నారు. ఆడంగులు మెనిగల్ల యల్తారంట" అని చెప్పాడు.

పద్మనాభయ్యగారు మంచి మోతుబరులు. వారికి యితరవూళ్ళలోగాని ఆ వూళ్ళోగాని మొత్తం డెబ్బై యనభై యకరాల భూమి వున్నది. పైన వడ్డీ వ్యాపారం గూడా కొంతవున్నది. పద్మనాభయ్యగారు ట్రైనింగు ప్యాసై, వెనక కొన్నాళ్లు టీచరుపని చేసి విరమించారు. వారి కుమారుడు గుంటూరులో యేదో వుద్యోగం చేస్తు న్నాడు. వారు మొదటి నుంచీ పొలాలన్నీ మక్తాకు యివ్వడమే వాడుక. గోపయ్య పదేళ్ళ బట్టీ వారిపొలం నాలుగెకరాలు చేస్తున్నాడు. గోపయ్యకు వేరే ఆస్తి యేమీలేదు. అదే జీవనం. వ్యవసాయం లేనప్పుడు బాడుగ తోల్తాడు.

పద్మనాభయ్యగారి మాటంటే గోపయ్యకు సుగ్రీ వాజ్ఞ. వారి యింట్లో యే మంచి చెడ్డ వచ్చినా పురుడు మొదలుకుని, పెళ్లివరకూ, యితడు వెళ్లి చాకిరీ చెయ్యవల సిందే. ఒకసారి యేమయిందంటే, ఆ వూళ్లో దొంగల హడావిడి జాస్తీగా వున్నది. పద్మనాభయ్యగారు గోప

య్యను వారి యింట్లో పడుకోబెట్టుకున్నారు. గోపయ్యది ఎండకు ఎండి, వానకు తడిసి బిగిసిన శరీరం. కర్ర పుచ్చుకుంటే పదిమందికి జవాబు చెప్పగలడు. ఆ సందర్భంలో దొంగలకూ అతనికీ జరిగిన ఘర్షణలో గోపయ్య కుడి భుజంమీద బలమైన గాయం తగిలింది. అది మానేటప్పటికి నెలరోజులు పట్టింది. యిప్పటికీ భుజంమీద ఆ మచ్చ కనిపిస్తూనే వుంటుంది.

గోపయ్య నౌకరు తెచ్చిన వర్తమానం వినగానే ఇంటి పంచ కప్పుకు కట్టివుంచిన వంపుడు కర్రలను తీసి సవారిబండి కట్టి తోలు కెళ్ళాడు. తిరిగి రెండు రోజులకు గాని యింటికి రాలేదు. వచ్చిన తర్వాత తన పనులు చూసుకున్నాడు.

౪

మూడు మాసాలు గడిచినవి. అది వైశాఖ మాసం. ఏరో పౌర్ణమి దాపులోకి వస్తూవుంది. దేశానికి రైతు, వచ్చే సాలు కొత్త పంటను అందివ్వడానికి పొలం పనులు ప్రారంభించే రోజులవి. కడుపులో చల్ల కదలకుండా నీడ పట్టున కూర్చునే సుకుమారులందరికీ ఆహారం సమకూర్చడానికి కర్షకుడు నడుంకట్టే రోజులవి.

గోపయ్య ఆ యేడు పొలాన్ని బాగా బలపర్చదలుచుకున్నాడు. అధికోత్పత్తి చేసి కొందరు రైతులు

గవర్నమెంటువారి వల్ల బహుమతులు పొందిన విషయం, ఆనాడు పత్రికలో వార్త విన్నప్పటినించీ గోపయ్య మనస్సు అదనుకోసం కోడెదూడలా గంతులు వేస్తున్నది. యెక్కువ పండించి తానుమాత్రం యెందుకు బహుమతి పొందకూడదు? తానేం అసమర్థుడా? వ్యవసాయంలో మదుపులన్నీ తనకు తెలుసునాయె. ఒకవేళ బహుమతి రాకపోయినా తనకు వచ్చే నష్టమేముంది? చేసిన కష్టంవారా, పెట్టిన బలంవారా పొలం యెట్లయినా యెక్కువ పండి తీరుతుంది గదా. ఆ గింజలు అమ్మి, తెచ్చిన బాకీ తీర్చుకోవచ్చు. యిట్లా ఆలోచించుకుని, గోపయ్య కోమటి గురవయ్య దగ్గర పంటకళ్ళాల్లో యిచ్చేటట్టు మాట్లాడుకుని, వందరూపాయలు అప్పు తెచ్చి, తన దొడ్లో యెరువు గాక, ఇంకా యితరచోట్ల నైమట్టి కొన్నాడు. ఏరో పౌర్ణమిలోపుగానే పొలం పనులన్నీ పూర్తి కావాలి గనక మంచి రోజు చూసి నాలుగైదు రోజుల్లో పొలానికి నైమట్టి తోలడం ప్రారంభించా లనుకున్నాడు.

బరెపడ్డకు వాతం చెయ్యగా వుప్పర మంత్రాలును పిలుచుకు వచ్చి కాయం పెట్టించి, ఆ సాయంత్రం బ్రాహ్మడి యింటికి వెళ్ళి పొలంలో మట్టి తోలడానికి మంచి రోజెప్పుడో అడగ్గా రేపే మంచి రోజని చెప్పాడు. గోపయ్య అడిగి యింటికి వచ్చేటప్పటికి చీకటిపడ్డది. తాను వేకువ ఝామునే పొలంలోకి బండి కట్టాలి. అతడు ఆదరా, బాదరా దీపంబుడ్డి పట్టుకెళ్లి ఇంటి యెదురుగా చెట్టుక్రింద

విడిచిన బండికి గండెన పెడుతున్నాడు. అతడు గండెన పెడుతున్నాడన్న మాటేగాని అతని కళ్ళకు పండి ఒరిగి పోయిన వరిచేలూ, కళ్ళంలో కళ్ళుతిరిగే ధాన్యంరాసులూ కనిపిస్తున్నవి. ఒకవైపున గండెనపెట్టడం కాగా, రెండో వైపు చక్రం వూడదీసి ఆముదంలో ముంచిన నారతడపలు యిరుసుకు చుడుతున్నాడు. చెట్టుమీద తీతువపిట్ట కూస్తున్నది.

ఇంతలో పద్మనాభయ్యగారి నౌకరు వచ్చాడు. గోపయ్య అతణ్ణిచూసి ఖంగారు పడ్డాడు. వేకువఝామునే పొలం వెళ్ళవలసిన బండిని కొంపతీసి యే చుట్టాల యింటి కైనా కట్టమని కబురు రాలేదు కద; అనుకుంటూ "యేం సీతయ్యా! పనిమీద వొచ్చావు?" అని అడిగాడు.

గాలికి బుడ్డిదీపం పెద్దదైంది. "అయ్యగారు నిన్ను పొలంలో మట్టి తోలొద్దన్నాడు." అన్నాడు సీతయ్య.

"ఎందుకని?" అని అడిగాడు నిశ్చేష్టుడై గోపయ్య.

"అయ్యగారు యిక నిన్ను పొలం సెయ్యవద్దని చెప్పిరమ్మన్నారు." అన్నాడు సీతయ్య.

ఆ మాటలు వినేసరికి గోపయ్యకు తలతిరిగి బ్రహ్మాండం తలకిందైనట్లయింది. శిలాప్రతిమలా నిలబడి పోయ్యాడు.

* * *

# వ్యత్యాసాలు

రాజాగారికి పుత్రోదయం అయింది. ఆ శుభవార్త గాలికంటే వేగంగా పరగణాలంతా వ్యాపించింది. దివాణంలో ఫిరంగులు పేలినవి, మంగళవాద్యాలు చెలరేగినవి, సంతోషంతో పౌరుల నోళ్లు మ్రోగినవి, వార్తా పత్రికలన్నీ ఘోషించినవి.

రాజాగారికి పుత్రోదయం అయిన వేళకే ఊరి వెలుపల పూరిగుడిశెలో పేరమ్మగూడా మగశిశువును కన్నది. ఫిరంగులూ మంగళవాయిద్యాలు ఏమీ మోగలేదుగానీ ప్రక్కయింటిలోని ముసలిమొద్దు నిలబడి టప్ టప్ మని చిటపలు వేసింది. మర్రిచెట్టుమీది గుడ్లగూబమాత్రం గానం చేసింది. ఆమె కన్న సంగతి ఇరుగుపొరుగు వాళ్ళకు గూడా తెలియదు. ఇద్దరు శిశువులూ- కాళ్ళు చేతులు ఆడించడం, నవ్వడం, ఏడవడం, ఇద్దరిదీ ఒకటేఆట, ఒకటేపాట. ఇద్దరూ దేవుని సన్నిధానంలో ఒకటిగానే పెరిగారు. ఒకే వేళకు భూమిమీదికి వచ్చారు. భూమిమీదికి రాగానే ఒకళ్లు బంగారు ఉయ్యాలలో ఒకళ్ళు కుక్కిమంచంలో ఒకళ్లు దివ్యభవనంలో. ఒకళ్లు పూరిగుడిశెలో. వాళ్లు పొందుతూవున్న ఈ భేదంగూడా తెలుసుకోలేనంతటి కసికందులు ఇక ఈ ముడిపదార్థాలు భ్రమరకీటక న్యాయంగా ఆర్థికంగానేమి సాంస్కృతికంగానేమి వాళ్ళ వాళ్ళస్వస్వరూపాలుపొందుతవి.

ఇద్దరు శిశువులూ శుక్లపక్ష చంద్రులవలె దినదినాభి వృద్ధి పొందుతున్నారు. ఇద్దరికీ నామకరణాలు జరిగినవి. ఒకరిపేరు వెంకటచంద్రమోహనకృష్ణప్రసాదు. ఒకరిపేరు వెంకటనరుసు. పేరమ్మది పేదసంసారం కావడంవల్ల భార్యాభర్తలు కూలీనాలీ చేసుకుని జీవిస్తూవుంటారు. వెంకటనరుసుకు ఐదోయేడు వచ్చింది. మాటలన్నీ బాగా వచ్చి చలాకీగా ఆడుకుంటున్నాడు. ఒకరోజు సాయంత్రం తల్లి పొయిలోకి చిదుగులు యేరుకోడానికి ఊరివెలుపలకు పోగా వెంకటనరుసు తల్లివెంటబడి వెళ్ళాడు. అక్కడమైదానంలో జమీందారుగారి అబ్బాయి నౌకర్లు వెంటవుండగా మూడు కాళ్ళ సైకిలు తొక్కుతున్నాడు. ఆ దృశ్యాన్ని వెంకటనరుసు చూశాడు. అంతవరకు తాను మూడుకాళ్ళ సైకిలు చూసివుండలేదు. కాస్సేపు వెనకాల చేతులు పెట్టుకుని అబ్బురంగాచూసి తల్లికిచెప్పకుండానే అక్కడకు లగెత్తాడు. చెట్లకింద చిదుగులు యేరుకోవడంలో నిమగ్నమైవున్న తల్లి అది కనిపెట్టనేలేదు.

వెంకటనరుసు వెళ్ళి సైకిలుదాపులో నిలబడ్డాడు. సైకిలుతొక్కుతున్న రాజాగారి అబ్బాయి వెంకటచంద్రమోహనకృష్ణప్రసాదు వెంకటనరుసు ఇద్దరూ ఒకళ్లని ఒకళ్లు చూసుకున్నారు. ఏదో ఉభయులకు జన్మజన్మాంతరములనుండి బాంధవ్యం వున్నట్లు ఇద్దరిముఖాలు ఆనందంతో తొణికిసలాడి పోయినవి. కృష్ణప్రసాదు తక్షణం సైకిలు మీదనుంచి దిగి వెంకటనరుసు దగ్గరికి వచ్చాడు. వెంకట

నరుసుకు గోచీ మొలత్రాడు రెండూ లేవు. జమీందారు గారి అబ్బాయికి వంటినిండా నగలు, విలువైన దుస్తులు. నౌకర్లు వారిస్తున్నా వినకుండా కృష్ణప్రసాదు వెంకటనరుసు చెయ్యిపట్టుకుని ఆహ్వానించాడు. ఇద్దరు కుర్రవాళ్లు చేరి కాసేపు సైకిలుఎక్కుతూ ప్రాణమిత్రుల్లాగా ఆ మైదానంలో సంతోషంతో కేరింతాలు కొడుతున్నారు.

అక్కడ పేరమ్మ చూసుకునేసరికి కుర్రవాడు లేడు. ఎటు వెళ్ళాడా అని ఆదుర్దాతో అటు చూసింది. కొంత దూరాన మైదానంలో మూడు కాళ్ళ సైకిలు తొక్కుతూ తన కొడుకు కనిపించాడు. తన కళ్ళను తాను నమ్మలేక దాపులోకి వెళ్ళి చూసింది. నిజంగా తనకొడుకే! జమా యించి సైకిలుతొక్కుతున్నాడు. దగ్గరగా జమీందారుగారి అబ్బాయివున్నాడు. కొంచందూరంలో నౌకర్లు నిలబడి వున్నారు. "వరేయ్" అని కేకవేసింది పేరమ్మ. ఆపిలుపు అతడు వినిపించుకోలేదు, "వరే అబ్బాయ్" మళ్ళా కేక పెట్టిందిపేరమ్మ. ఈ దఫా "వుండవేలఅమ్మా వత్తాను" అతని వద్దనుంచి జవాబు వచ్చింది. "ఈ రవ్వా మీ అబ్బాయేనా బలేస్నేహితుడు దొరికాడు మా చిన్న బాబుగారికి. అన్నాడో నౌకరు. పేరమ్మకు ఆ మాటలుగూడా వినపడ లేదు. జమీందారుగారి అబ్బాయీ తన కొడుకూ ఒక్క రోజున పుట్టినందుకే ఆమెకు గర్వంగావున్నది. ఎవరైనా కుర్రవాడికి ఎన్నో యేడని అడిగినప్పుడు ఆమె రాజాగారి అబ్బాయి, మా అబ్బాయి, వక్కగడియలోనేగా పుట్టింది.

అని సగర్వంగా చెప్పుకుంటుంది. ఇప్పుడు ఇద్దరూ కలసి ఆడు కోవడం చూసేసరికి ఆమె తన్మయత్వంలో మునిగి పోయింది.

చీకటిపడడానికి ఎంతో వ్యవధి లేదు. నౌకర్లు జమీందారుగారిఅబ్బాయిని ఇంటికి వెళ్ళుదాం రమ్మని ఎంత పిలిచినా ఆ కుర్రవాడు కదలటం లేదు. పేరమ్మ తనకొడుకును పిలిచినా వాడూ పలకటం లేదు. వెలుతురు వున్నంతవరకూ వాళ్ళిద్దర్ని ఇళ్ళకు మళ్ళించడానికి వాళ్ళ తరం కాలేదు.

చీకటిపడ్డ తర్వాత తల్లి వెంట ఇంటికి నడుస్తున్న వెంకటనరసు తల్లితో.

"అమ్మా అటువంటి బండి నాకు కొనిపెట్టవు ?" అని అడిగాడు.

"మన కెట్టా వస్తయిరా" అన్నది.

"యెందుకు రావు"

"మనం బీదవాళ్ళం"

"బీదవాళ్ళకి అటువంటి బండిరాదు ?"

"రాదు"

"యెందుకు రాదు ?"

"మన దెగ్గిర డబ్బు లేదు"

"వాళ్ళకుబండి యట్టావచ్చింది నీయన్నీ అబద్ధాలు"

"వాళ్లు మారాజులు వాళ్ళకీ మనకీ ఎక్కడరా"

"యెందుకని ?"

"వాళ్ల దెగ్గిర చాలా డబ్బుంది"

"మన దెగ్గిర యెందుకు లేదు?"

"అరవమాకురా షోది"

"మరి నాకు బండి కొనిపెట్టవు అమ్మా"

"బండీ లేదు గిండీ లేదు నడువు"

"అయితే నాదెగ్గిర కానీ గుంటతీసి మొలేస్తే చెట్టుమొలిసి చానా డబ్బులు కాస్తయి. అప్పుడు కొనుక్కుంటా బండి"

౨

కాలచక్రం గిర్రున తిరిగింది. ఇద్దరు కుర్రవాళ్లూ పెద్దవాళ్ళయ్యారు. పాతిక ఏళ్ళు వచ్చినవి. ఎవరి యీ వృత్తులలో వాళ్లు నిమగ్నులయ్యారు. వెంకటనరుసు కాయకష్టంవల్ల ఎన్నో పంటలు పండుతున్నవి. వెంకట చంద్రమోహనకృష్ణప్రసాదుకు కవిలెపెరిగి ఎన్నో భూములు కొనివేయబడుతున్నవి. వెంకటనరుసు చమటవల్ల ఎన్నో కట్టడాలు లేస్తున్నవి. జమిందారుగారికి బాకీలక్రింద ఎన్నో ఇళ్లు స్వాధీనమవుతున్నవి. ఇట్లా కాలం వెళ్ళిపోతున్నది.

ఒకరోజున కృష్ణప్రసాదు గుర్రంయెక్కి పొద్దునే షికారు బయలుదేరాడు. అదేసమయానికి వెంకటనరుసు ఆ బాటనే పొలానికి వెళుతున్నాడు. ఇద్దరిదీ ఒకే గ్రామం కావడంవల్ల అప్పుడప్పుడు ఇద్దరూ తారసిల్లుతూవుండడం

కద్దు. కృష్ణప్రసాదు ఇతని కేసి చూడకుండానే వెళ్ళిపోతూ వుంటాడు. వెంకటనరుసుకు కృష్ణప్రసాదు కనిపించినప్పుడల్లా అతని కేదో కడుపు నిండినట్టుగా వుంటుంది. ఇద్దరూ ఒక రోజున పుట్టిన సంగతీ, చిన్నతనంలో ఇద్దరు కలసి ఆడుకున్న సంగతీ. తనతల్లి అప్పుడప్పుడు అతనికి చెప్పుతూ వుంటుంది. ఈ బాదరాయణ బాంధవ్యంవల్ల కనిపించినప్పుడల్లా వెంకట నరుసు కృష్ణప్రసాదును పలకరించాలని కూడా అనుకుంటాడు కానీ అతడు గొప్పవాడవటంవల్ల పలకరించడానికి సాహసించలేక పోతాడు.

ఆరోజున కృష్ణప్రసాదు గుర్రం యెక్కి ముందు వెళ్ళిపొయ్యాడు. వెనక వెంకటనరుసు వస్తున్నాడు. కృష్ణప్రసాదు స్వారి చెయ్యడంలో నెత్తిమీది టోపీ కింద పడిపోయింది. అతడు గుర్రాన్ని ఆపాలని చూశాడుగానీ అది ఆగకుండా వుడాయించింది. వెనకవస్తున్న వెంకటనరుసుకు నేలమీద పడివున్న టోపీ కనిపించింది. ముందు కృష్ణప్రసాదు గుర్రం ఎక్కి వెళ్ళడం అతడు చూసివుండడంవల్ల ఆటోపీ కృష్ణప్రసాదు దేనని గ్రహించి ఈఅవకాశాన్ని పురస్కరించుకుని అయినా అతనితో మాట్లాడవచ్చుననే తలంపుతో టోపీ పుచ్చుకుని బయలుదేరాడు. ఎండకూ వానకూ బిగిసిన శరీరం. ఒక్క పరుగులో వెళ్ళి కొంతదూరాన గుర్రాన్ని మళ్ళించడానికి ప్రయత్నిస్తూవున్న కృష్ణప్రసాదుకు "బాబు గారూ యిదుగో టోపీ" అంటూ చేతిలో టోపీ అతనికిచ్చి ప్రతివచనంకోసం చెవులు రిక్కించుకుని నిలబడ్డాడు. అతడు

నోరు మెదల్చలేదు. టోపీదులిపి నెత్తిన పెట్టుకుని గుర్రాన్ని పుదాయించాడు.

ఇది జరిగిన రెండు మాసాలకు ఒక చిత్రమైన సంఘటన జరిగింది. ఆగ్రామాన్ని ఆనుకుని ఒక చిట్టడవి వున్నది. ఒకరోజు సాయంత్రం వెంకటనరుసు వంటచెరకు తెచ్చుకోడానికి గొడ్డలి పుచ్చుకుని చిట్టడవికి బయలుదేరాడు. కృష్ణప్రసాదుగూడా అదేసమయానికి తుపాకి చేత్తో పుచ్చుకుని చిట్టడవికి షికారుకు బయలుదేరాడు.

వెంకటనరుసు అడవిలో కట్టెలు కొట్టుకుంటూవుండగా ఒక దృశ్యం అతని కళ్ళబడ్డది. అతనికి నాలుగైదుగజాల దూరంలో ఒక పొదమాటున చిగుళ్ళను మేస్తున్న కుందేలును పట్టడానికి వెనకనుంచి ఓ కొండచిలువ మెల్లగాదాన్ని సమీపిస్తున్నది. అతడుచూడడం క్షణంఆలస్యమైతే కొండచిలువకు కుందేలు ఎరఅయిపొయ్యేదేగాని తక్షణం వెంకటనరుసు వెళ్ళి గొడ్డలితో కొండచిలువను చితుకగొట్టి కుందేలును రక్షించాడు. మనిషిని చూడగానే కుందేలు చెంగుచెంగున గంతులు వేసుకుంటూ వెళ్ళిపోతూవుంటే వెంకటనరుసు తనమూలకంగా ఒక సాధుజంతువు రక్షింపబడ్డదన్న సంతృప్తితో ఆప్యాయంగా దానివంకనే చూస్తున్నాడు. కుందేలు ఎంతో దూరంగూడా వెళ్ళలేదు. ఇంతలో తుపాకిగుండు దూసుకుపోయి పాపం కుందేలు విలవిల తన్నుకుని నేలమీాది కొరిగింది. వెంకటనరుసు ఆనందిస్తున్న ఆకళ్ళ

తోనే ఆ విషాద దృశ్యాన్ని కళ్ళారా చూశాడు. అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగినవి. ఇంతలో వడివడిగా చేతులో తుపాకితో కృష్ణప్రసాదు చచ్చి పడివున్న కుందేలువద్దకు వచ్చి నిలబడ్డాడు. తాను కాపాడిన ప్రాణాయె. వెంకట నరసుకు ఉద్రేకం వచ్చిందిగానీ ఏమిచేయగలడు? ఇందాక కుందేలును చంపడానికి చూస్తున్న జ్ఞానంలేని జంతువు కాబట్టి దానిమీదికి పోయ్యాడు. ఇప్పుడేమి చేయగలడు? "నువ్వేనా దాన్ని చంపింది?" అన్నాడు ఆవేదనతో.

ఈ చిట్టడవి తనది, ఈ జంతువులు తనవి. తన భూభాగంమీద జీవించే ఓ అధముడు తననేనా ఇటువంటి ప్రశ్న వెయ్యడం? వాకిటిముందుకు బిచ్చానికి వచ్చినవాడు ఈ ఇల్లు మీ స్వంతమేనా అని ప్రశ్నిస్తే ఇంటి యజమాని కెలావుంటుంది! కృష్ణప్రసాదు క్రుద్ధుడైపొయ్యాడు. వెంటనే కొంచెందూరంలో చెట్టుకింద జంతుకళేబరాలకు కాపలా వున్న సేవకులను పిలిచి "ఫారెస్టులో ఈ పోగరుబోతు కట్టెలు కొడుతున్నాడు. వీణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి ఠాణాకు తీసుకుపదం" డని ఆజ్ఞాపించాడు.



# చేతులు కాలాక ఆకులు

అన్నదమ్ములిద్దరూ విభాగాలై పోతున్నారు. పెద్దవాడి పేరు కన్నయ్య, రెండోవాడి పేరు కామయ్య. తండ్రి సంపాయించి యిచ్చి వెళ్ళిన పన్నెండెకరాల మాగాణి, పదెకరాల రేగడ, పద్ధెనిమిది గదుల మండువా లోగిలీ, పది గదుల గొడ్లచావడి, మొత్తం చెరిసగం పంచుకుని హద్దులు వేసుకోటం అయింది. యిక పారీకత్తు వ్రాసుకోవటమే తరువాయి. అన్నదమ్ములిద్దరూ ఆ రాత్రి వరండాలో లాంతరుముందు కూర్చుని డబ్బూ దస్కం లెక్క చూసుకుంటూ వుండగా వాళ్ళవితంతు చెల్లెలు గౌరమ్మ అక్కడకు వచ్చింది. వయస్సు పాతికేళ్లుంటవి. గౌరమ్మకు అత్తవారి తరఫున ఆదరవు ఏమీ లేనందువల్ల భర్తపోయిన అయిదేళ్ళనుంచీ పుట్టింటనే పడివుంటున్నది. తల్లి ఎప్పుడో చనిపోయింది. తండ్రి చనిపోయి మూడేళ్ళయింది. తండ్రి పోతూపోతూ కొడుకులిద్దర్నీ పిలిచి "మిమ్మల్ని గురించిన చింత నాకేమీ లేదు. అమ్మాయిదే నాకు చింత. అమ్మాయిని గురించి మీకు నేను చెప్పపనిలేదు. అది పిల్లాజల్లా లేని మోడు. మీరేలా చూస్తారో" అని చెప్పి కళ్లు మూశాడు.

గౌరమ్మ వచ్చి నిలబడి "పెద్దన్నయ్యా!" అన్నది.

తల వంచుకుని కాగితంమీద కలంపెట్టి ఏదో వ్రాస్తున్న కన్నయ్య తల ఎత్తిచూసి "ఏమిటమ్మా?" అన్నాడు.

"మీరు ఎవరంతట వాళ్లు విడబడిపోతుంటిరి. యిక నాగతేంకాను? నాకేమయినాచెప్పరు?" అన్నది బిడియ పడుతూ గౌరమ్మ.

"మేం విడబడిపోతే మాత్రం నీకేం కొరత? ఇద్ద రిలో నీయిష్టంవచ్చిన వాళ్ళదగ్గర వుంచువుగాని" అన్నాడు కన్నయ్య.

"కూడా వుంటే అడిగేటందుకు నాకేంపని అన్నయ్యా? వేరే వుంటున్నారు గాబట్టి అడుగుతున్నాను" అన్నది గౌరమ్మ.

"అవునమ్మాయి యిప్పుడు నీకొచ్చిన యిబ్బం దేమిటి? ఏకంగా వున్నప్పటికంటె యిదే నీకు వీలు. నీఅను కూలాన్నిబట్టి ఒక చోటగాకపోయినా మరో చోటయినా వుండొచ్చు" అన్నాడు కన్నయ్య.

"ఆరు సవర్ల పలకశీల పట్టెడ ఒకటి వ్రాయ వయ్యా!" అని తొందరిస్తున్నాడు కామయ్య.

"మీరు భోజనాలు వేరే అవటంకాకుండా నాయన సంపాయించిన ఆస్తినికూడా పంచుకుంటూ వుంటిరి; రేపు ఒకనాటికి ఆడవాళ్ళలో మాకూ మాకూ పడకపోవచ్చు! అప్పుడు నాగతేంకాను?" అన్నది గౌరమ్మ.

కామయ్య నోరుచేసుకుని "ఓహో! నాయన సంపా యించిన ఆస్తి పంచుకుంటున్నాం కాబట్టి నీక్కూడా వాటా పెట్టాలన్నమాట?" అన్నాడు కటువుగా.

“వాటా పెట్టమనటం లేదు. చిన్నన్నయ్యా! ఏమయినా! చెప్పమంటున్నాను” అన్నది తల వంచుకుని గౌరమ్మ.

కన్నయ్య అన్నాడు “ఏమిటి చెప్పేది నీ మొఖం? అంతా పిచ్చిఆలోచనా పిచ్చి కథానూ. అయ్యో! నాకు పిల్లాజల్లా యింత బాదరబందితో ఎట్లా బ్రతికేదని అంటావా! ఒంటిదానివి. నీకేం కావాలి? యింత కూడూ గుడ్డ!”

“రేపు ఎలాపోయి ఎలా వచ్చునో నాయన సంపాయించిన ఆస్తిగదా! పోనీ ఒక యకరం నాపేర రాసితే నే నేమయినా కట్టుకెళతానా?” అన్నది గౌరమ్మ.

“నాయన సంపాయించిన ఆస్తి నాయన సంపాయించిన ఆస్తని పటికిస్తావు. ఆయన మాకేం పరగణాలు సంపాయించి యిచ్చివెళ్ళాడని? తిప్పి తిప్పి లెక్కవేసినా పాతికెకరాలు లేదు!” అన్నాడు కన్నయ్య.

ఇక తన యిస్సా అందుకున్నాడు కామయ్య. “ఆ సోదంతా ఎందుకయ్యా? తండ్రి ఎంత సంపాయించి యిచ్చి వెళ్లి తేనేం! ఆడపిల్లల కిచ్చే దెవడు? అసలు యిట్లా తెగించి అడిగేదిమాత్రం ఎవరు? దీనికెవరో దుర్బోధచేసి పంపినట్టుంది. (చెల్లెల్ని వుద్దేశించి) ముసలాయన బ్రతికి వుండగా ఒక్కగాను ఒక్కపిల్లవని మీకు ఎన్ని ఎత్తులు పెట్టింది మాకు తెలుసు. పైగా యిప్పుడు పొలం కావాలని

అడుగుతున్నావా అమ్మా! యింకా నయం పాటాకావా లని కూర్చోలేదు!'' అన్నాడు.

పెద్దలు చట్టంద్వారా ఆడపడుచుల గొంతులు ఏనాడో నొక్కివేశారాయె. గౌరమ్మ మారు మాట్లాడ కుండా అన్నరాలై ఇంట్లోకి వెళ్ళి పోయింది.

౨

ఫారీఖత్తు రిజిస్టరు అయిపోయింది. ఇంటికి పడమర వైపున కన్నయ్య, తూర్పువైపున కామయ్య ఎవరి భాగంలో వాళ్ళు వుంటున్నారు. గౌరమ్మ పెద్దవాడిదగ్గరే వుంటున్నది. ఇంటిచాకిరీ అంతా గౌరమ్మవశం, ఇంటి పెత్తనమంతా వదినెగారి వశం అయిపోయినవి. వదినె గారు అవతల పుల్ల యివతల పెట్టదు. ప్రతిపనీ గౌరమ్మ మీందనే రుద్దుతుంది. అదీగాకుండా కూడావున్నప్పుడు తోడికోడళ్ళిద్దరూ వంతులు పడి ఖర్చు పెట్టుకునేవాళ్ళు! అప్పుడు గౌరమ్మకు ఏమైనా చిల్లర కావలసివచ్చినా ఏమీ అభ్యంతరం వుండేదికాదు. ఇప్పుడల్లా కాదు. తోడికోడళ్ళిద్దరకూ తగని బిజన ఏర్పడ్డది. దీపపు చమురు దగ్గరనుంచీ ఎంతో పొదుపు! కానీ ఖర్చుదగ్గరనుంచీ ఎన్నో అజలు!

ఆ గ్రామానికి టూరింగు టాకీ ఒకటి వచ్చి పది రోజులనుంచీ ఆడుతున్నది. ఆరోజున యిరుగు పొరుగు

అమ్మలక్కలంతా సినిమాకు వెళ్ళుతూ వుంటే గౌరమ్మకు కూడా వెళ్ళాలన్న కుతూహలం కలిగింది. కన్నయ్య ప్రొద్దున తన పనిమీద వెళ్ళితే రాత్రికి ఇల్లు చేరుకుంటూ వుంటాడు. అందువల్ల గౌరమ్మ "వదినే ఒక పావలా యిస్తావూ? సినిమాకు వెళతాను" అని అడిగింది.

ఆమె ముఖం అదో మాదిరిగా పెట్టి "అయ్యో! నాదగ్గ రెక్కడయ్యమ్మా! నాకేమయినా యిచ్చి వెళ్ళాడా? వచ్చాక మీ అన్నయ్య నడుగు" అని రాగం తీసింది. అంతటితో గౌరమ్మ మనస్సు చివుక్కు మన్నది. సినిమాకు వెళ్ళడమే విరమించు కున్నది.

సినిమాకు వెళ్ళదామన్న వుద్దేశంతో గౌరమ్మ రెండు గేదెల పాలూ పెందలకడనే పితికి వుట్టి మీద వుంచింది. చీకటిపడగానే దీపాలు వెలిగించి ఆ పితికిన పాలను పొయ్యిమీద పెట్టి కాచి పిడతను చుట్టకుదురు మీదపెట్టి ఏదో పనిమీద చావట్లోకి వెళ్ళింది. వదినె గది గుమ్మంవద్ద కూర్చుని పిల్లలకు అన్నం పెడుతూనే వున్నది. ఇంతలో పిల్లి వచ్చి పాలపిడతను దొర్లించి రెండువ్రక్కలు చేసింది. అదిచూసి వదినె చిందులు త్రొక్కింది. వదినె గారి అరుపులు విని గౌరమ్మ పరిగెత్తుకుంటూ వచ్చి "అయ్యో! మాయదారి పిల్లి ఎక్కడ దాపర మయిందో దాని జిమ్మడ! నువ్వు వున్నావుగదా అని గొడ్లకు మేత వేసి రాపోయ్యాను వదినే!" అన్నది.

ఆశ్రితులమాట ఏమి నిలుస్తుంది? "ఎంత నంగ నాచివే నాతల్లీ! పైగా నా మీద ములపరిస్తున్నావ్? చూస్తుండమని ఎవరితో చెప్పి వెళ్లావ్? అన్నీ పట్టీపట్టని పనులు! ఇందాక సినిమాకు డబ్బు లేవన్న దగ్గర నుంచీ మొఖం తంపటిలాగా పెట్టుకుని, నాటకం తొక్కటం తెలుస్తానే వున్నది" అని విసులుకున్నది వదినెగారు.

గౌరమ్మ కళ్ళల్లో గిఱ్ఱున నీళ్ళు తిరిగినవి. మారు మాట్లాడకుండా పగిలిన పెంకుల్లోకి నేలమీద పాలను ఎత్తుతూవున్నది. ఇంతలో కన్నయ్య వచ్చాడు. అతను ఆ దృశ్యాన్ని చూడటమే కాకుండా భార్యకూడా విపుల వ్యాఖ్యానం చేసింది; కన్నయ్య చెల్లెలనే కూకలు వేశాడు. అప్పటికి వాళ్ళు విభాగాలై రెండు మాసాలు కావచ్చింది. గౌరమ్మ యిక అక్కడ వుండటానికి కష్టం తోచింది. ఆ మర్నాడు వాళ్ళ భార్యాభర్తలతో చెప్పి రెండోవాడు కామయ్య యింటికి మారింది.

౩

గౌరమ్మ అక్కడ ప్రవేశించిందన్నమాటే కాని అక్కడి వాతావరణమూ అలాగే వున్నది. పెద్ద వదినెగారికంటే చిన్నవదినెగారు రెండాకు లెక్కువ చదివింది. ఒకరోజు సాయంత్రం పొలం నుంచి పశువులువచ్చి వాళ్లు వాకిటిముందు ఎండబోసిన వడ్లమీద పడినవి. ఆసమయానికి

గౌరమ్మ అవతలవాళ్లో వాళ్ళ పెద్దన్నయ్యగారి కుఱ్ఱవాడు ఏడుస్తూవుండగా ఆ కుఱ్ఱవాడు ఆమెకు మాలెం అవటంవల్ల వెళ్ళి సముదాయిస్తున్నది. పొలంనుంచి పశువులు రావడం, వడ్లమీద పడడం, చిన్నవదినె చూస్తూనేవున్నదిగాని, ఆ అవకాశాన్ని ఆమె వృధాచెయ్యదలుచుకోలేదు. "ఏదెట్లా తగులబడిపోతే ఎవరికేం పట్టింది? తినేదిక్కడ! చేసేదక్కడానూ! తీపి తీపే!" అంటూ సాగించింది. అసలే తోడికోళ్ళిద్దరికీ పడదు. పచ్చిగడ్డివేస్తే భగ్గున మండుతుంది. "ఎవరికి చేస్తున్నది? ఎవరికి చెందుతుంది ఎవరు తీపి? మేమంటే అందర్నీ అలాగే పీకుతుంది" అని అవతల ఆమె ఎత్తుకున్నది. తోడికోడళ్ళిద్దరికీ ఆరోజున హాహాకారీ పోట్లాట; సిగపట్ల గోత్రందాకా అయింది. మధ్య గౌరమ్మ గుడ్లప్పగించి చూస్తూవుండిపోయింది. ఆరోజుతో అవతల వాళ్లివతలకూ, యివతలవాళ్లవతలకూ లేకుండా ఇద్దరిమధ్య దడి ఏర్పడ్డది.

తర్వాత పదిరోజులకు చిన్నవదినె యింట్లోలేదు. అది పుదయంపూట. పొరుగింటామె వచ్చి "అమ్మమ్మ! తవ్వెడు బియ్యం బదులిస్తూ, వడ్లు దంచలేదు" అని గౌరమ్మను అడిగింది. ఎవరి అవసరమైనా ఒకటేగదా అనుకుని గౌరమ్మ యిచ్చింది. అవి పమిటచెంగులో కట్టుకుని పొరుగింటామె వెళ్లిపోతున్నది. ఇంతలో ఎక్కడనుంచో చిన్న వదినె వచ్చింది. పొరుగింటామె ఏదో పట్టుకువెళ్లటం చూసేసరికి గౌరమ్మమీద ఆమెకు తగని

అనుమానం వేసింది. తాను ఇంటివద్ద లేనప్పుడు గౌరమ్మ ఇల్లంతా దోచివేస్తున్నదని తలచింది. మనిషి ఎంత తేలిగ్గా కనిపిస్తే అన్ని అనుమానాలు పుట్టుకొస్తవి గావును!
"ఏమిటీ ఆమెకిచ్చావు?" చురచుర చూస్తూ గౌరమ్మను అడిగింది.

'వచ్చి అడిగితే తవ్వెడు బియ్యం బదులిచ్చాను వదినే" అని చెప్పింది గౌరమ్మ.

ఆ మాటకు ఆమె అనుమానం నివృత్తి కాలేదు. ముఖం చిట్లించుకుని "బదులా బదులు! ఎందుకివ్వాలి?" అన్నది.

గౌరమ్మ మళ్ళీ మాట్లాడలేదు. ఎందుకిచ్చానా అని లోలోన బాధపడ్డది. వదినెగారు ధుమధుమ లాడుతూ వసారాలో పళ్ళెక దగ్గర కూర్చుని మిరపకాయలు తొడాలు తీస్తున్నది. అప్పుడామె కళ్ళకు మిరపకాయలు సగం తరుగుపోయినట్లు కనిపించినవి. కుఱ్ఱవాడు వచ్చి "అమ్మా! కానివ్వవే" అని అడగ్గా వాణ్ణి రెండు చరుపులు చరిచి పంపింది. తర్వాత కాస్సేపటికి ఏదో అవసరంపడి చిల్లర నిమిత్తం వదినెగారు గూటిలో చెయ్యిపెట్టగా గూడు ఖాళీ! తాను రాత్రి పెట్టిన చిల్లర కనిపించలేదు. ఇంకేం "ఎక్కడ పెట్టినవి అక్కడ మాయమై పోతున్నవి! కొంపంతా ధ్వంసమైపోతున్న"దని అరవడం సాగించింది.

అవతల వంటచేస్తున్న గౌరమ్మ ఆ అరుపులు విన్నది. వదినెగారి దృష్టిలో చిల్లరతీసిన దోషి తానేననీ, ఆ ఆర్భాటమంతా తనమీదనేననీ, గ్రహించుకుని తన బ్రతుకునుగూర్చి లోలోన దుఃఖపడ్డది. ఇందాక కుట్టి వాడు గోతాలెక్కి గూట్లో డబ్బులు తీస్తూవుండగా గౌరమ్మ చూసి వుండటంవల్ల కుట్టివాడు తీశాడని ఆ విషయం వదినెగారితో చెప్పింది. గౌరమ్మ మాటలు వదినెగారు నమ్మకపోగా యింకా ఆమె అనుమానం బల పడ్డది. ''వాటికి కాళ్లొచ్చి అవి నడిచిపోతుంటే ఎవరేం చేస్తారమ్మా?'' అని దీర్ఘం తీసింది.

గౌరమ్మ చింతకు మేరలేదు. ఇంటిపనులన్నీ చేసి భోజనం చెయ్యకుండానె వసారాలో ఒకమూల కొంగు పరుచుకుని పండుకొన్నది. ఆ రోజుతో ఆమెకు జీవితం మీద విరక్తి పుట్టింది. ఈ అదమ స్తపు బ్రతుకు బ్రతికే దానికంటే దేనిలోనైనాపడి కళ్లుమూసుకుంటే మేలను కున్నది.

సందెపడింది. దీపాలు పెట్టేటందుకు ఎంతో వ్యవధి లేదు. అంతవరకూ నువ్వు తిన్నావా? తినలేదా? అని ఆమెను పలకరించినవాళ్ళు లేరు. పడి చనిపోదామని గౌరమ్మ ఊరువెలపలి భావిదగ్గరికి వెళ్ళింది. తీరా భావిదగ్గ రికి వెళ్ళేసరికి ఆమెకు ఏమి తోచిందోగాని ఉత్తరంగా రోడ్డునేపడి వెళ్ళిపోయింది. కారణం యిట్లా వూహించుకో వచ్చు. బావిలోపడితే తెల్లవారి రద్ది కావలసి వస్తుందని

అక్కడకు వుత్తరంగా మూడు మైళ్ళ దూరంలో వున్న కృష్ణలో పడాలని నిశ్చయించుకుని అయినా వుండవచ్చు. లేక బావిదగ్గరకు వెళ్ళేసరికి జీవితంమీద ఆశకలిగి ఇంటికి వెళ్ళడానికి మనస్కరించకపోయి అయినా వుండవచ్చు.

ఆ మర్నాడు చెల్లెలు ఇంట్లో లేకపోవడంవల్ల అన్నదమ్ములిద్దరూ రెండురోజులపాటు ఊళ్ళో బావులూ, చెరువులూ వెదికి వూరుకున్నారు.

౪

నాలుగు సంవత్సరాలు గడిచిపోయినవి. ఆప్రాంతానికల్లా వ్యాపారానికి బెజవాడ పట్టణం కేంద్రస్థానం. ఒక రోజున కన్నయ్య, కామయ్యలు చెరివక బండిమీదా పొగాకు పెండెలు వేసుకుని అమ్మకం నిమిత్తం బెజవాడ తోలుకెళ్ళారు. పొగాకు ఒక దుకాణదారుకు బేరంయిచ్చి సరుకువాళ్ళ గిడ్డంగిలో దించడానికి అన్నదమ్ములిద్దరూ అక్కడకు బళ్లు తోలుకువెళ్ళారు. అది చిన్న సందు. ఒక బండికంటే ఎక్కువపోదు. ఆ వీధిలో మేడలుగూడా ఏమీలేవు. ఒకటిరెండు కొద్దిపాటి డాబాలు తప్ప అన్నీ పెంకుటిఇండ్లు. అన్నదమ్ములిద్దరూ ఒక డాబాముందు బళ్లు నిలిపారు. కూలీలు పెండెలు లోనికి చేరవేస్తున్నారు. ఆ డాబాకు ఉత్తరంగా కొంచెందూరంలో కొన్ని వ్యభిచార గృహాలున్నవి. అది సాయంత్రసమయం కావటంవల్ల

వాళ్ళు అలంకరించుకుని వీధిగుమ్మాల్లో నిలబడడమూ, ఎవరెవరో వచ్చి మాట్లాడి వెళ్ళుతూ వుండడమూ బండి ముందు నిలబడివున్న కామయ్య అధంతా వినోదంగా చూస్తున్నాడు.

అట్లా చూస్తూ చూస్తూవున్నవాడల్లా ఎందుచేతనో మిన్నువిరిగి మీదపడ్డట్టు కంపించి పొయ్యాడు కామయ్య. రయ్యిన వెనుకబండివద్దవున్న అన్నదగ్గరకు వెళ్ళి "దాన్నేం చేసినా పాపం లేదు! ఎంతిదుర్మార్గాని కొడిగట్టిందో అటు చూడన్నయ్యా? ఇంకా మనం బ్రతికి దేనికి?" అన్నాడు కంపిత కంఠంతో.

కన్నయ్య, నివ్వెరపోయి "ఏం జరిగింది? ఇదసలే తడికల బజారు! ఆ గుడిసేటివాళ్ళు నిన్నేమైనా అన్నారా ఏమిట్రా?" అన్నాడు.

కామయ్య "అటుచూడు" మని చెప్పి గుమ్మంలో నిలబడివున్న ఓ స్త్రీని చూపగా, కన్నయ్య కళ్ళారా చూశాడు. తమ చెల్లెలు! గతించిన తన తాతముత్తాతలు లగాయితు, రానున్న మనమలు, మునిమనమలదాకా అటు యేడు యిటు యేడు పద్నాలుగు తరాలవరకూ కళంకం వ్యాపించినట్లయింది. అవమానంతో మనిషి గడ్డకట్టుకు పోయ్యాడు.

ప్రక్కయింటి రేడియోలో వ్యభిచారం నశించాలి! వేశ్యలకు పెండ్లిండ్లు చెయ్యాలి! ...... అంటూ ఎవరో ఉపన్యాసం పలుకుతున్నారు.



# శి ల్పి

శివయ్య, అతనిభార్య సీతమ్మ శుష్కించిన శరీరాలతో ఇంటివసారాలో నేలమీద ఎదురుబళ్లుగా కూర్చున్నారు. ప్రక్కగా చాపమీద పెద్దపిల్ల నిద్రపోతున్నది. రెండవపిల్ల కూర్చుని యేడుస్తున్నది. కొంచెం అవతల రెండవ అస్థిపంజరంలా కాళీమగ్గం వెళ్ళాడుతున్నది. దగ్గరగా యితర పరికరాలు విశ్రాంతి తీసుకుంటున్నవి.

"బిడ్డ అన్నం అన్నం అని యేడ్చియేడ్చి శోషవచ్చి నిద్రపోయింది" అన్నది సీతమ్మ.

"సోలెడుగింజలు ఎక్కడైనా బదులుతెచ్చి పిల్లలకైనా వండిపెట్టకూడదు?" అన్నాడు శివయ్య.

"ఇంకా యెవరిస్తారు. అవతలవాళ్ళకో మానెడు, యివతలవాళ్ళకో తవ్వెడు యివ్వవలసివుంటిమాయె. ఇంకా ఏ మొఖం పెట్టుకుని వెళ్ళి అడగమన్నారు. ?"

"ఏంచేస్తాంచెప్పు? మనం వుండగలం. ఎక్కడైనా తెచ్చి పిల్లలవరకైనా వండిపెట్టకపోతే వాళ్ళేంవుండగలరు? రెండురోజుల్లో షావుకారు మగ్గానికి పడుగుచూసి యిస్తానన్నాడు. ఇవాళా రేపు కళ్ళుమూసుకుంటే ఎల్లుండికి మజూరీవస్తుంది."

"ఆఁ ఆయన యిచ్చేది నిజమే! యీ వారం రోజులబట్టి అట్లాగే చెపుతున్నాడు. ఇక గింజలు అప్పు తీసుకురావడం నావల్లకాదు బాబూ. అయినా మనం మాత్రం ఎన్నాళ్ళని పస్తులు చెయ్యగలం? యింట్లో కంచం తప్పాలాలన్నీ ఆఖరై పోయినయ్యా, మీరు ఎవరి దగ్గరకైనా వెళ్ళి పడుగుసాధించుకుని రాకపోతే వీల్లేదు."

"నేను వూరుకున్నాననంటావా? అందర్నీ అడిగి చూశాను. ఎవ్వరూ లేదన్నారు. అయినా యీ మందంలో యితర్లు ఎవరు మగ్గానికి పడుగిస్తారు? గిరాకీలో నేయించుకునేవాళ్ళు యివ్వవలసిందే గాని!"

"గిరాకీలో నేయించుకుని లాభాలకిలాభాలు తిన్న వాళ్ళు మాత్రం యిస్తున్నారా?"

"వాళ్ళుమాత్రం యేంచేస్తారు? అటు శాస్త్రీ అమ్మక పోయే ఇటు నేయిస్తే దండగ వస్తూవుండే యెందాకని వాళ్ళుమాత్రం నేయిస్తారు?"

"లాభం వచ్చినప్పుడు సంతోషంగా తిని దండగ వచ్చేటప్పుడు మనల్ని మాడుస్తారా?"

"ఏంచేస్తాం? వాళ్ళకు సరుకు విడుదలకావడం లేదు. మనం నేసే షావుకారు దగ్గిర నిల్వవున్న సరుకుచూస్తే కళ్ళు తిరిగిపోయినై. సందు లేకుండా సరుకు యింటినిండా పేర్చారు. యింతకీ మిల్లుగుడ్డ వచ్చి మనగుడ్డను. పడ

గొట్టింది. యీ కరువు మన ఒకళ్లకే కాదు వూళ్ళో రెండువేల మగ్గాలవాళ్ళూ అంతా ఇలాగే అవస్థపడు తున్నారు.''

చూర్లోనుంచి ఎలుకలు కొట్టివేసిన కార్డు ఒకటి కిందపడింది. దాన్ని శివయ్య చేత్తో తీసుకున్నాడు. ఆ కార్డు 1940 లో మద్రాసు ఖాదీ కాన్ఫరెన్సువాళ్ళు అతనికి వ్రాసినది. అప్పుడు అతడు నేతలో గాంధీజీ విగ్రహాన్ని నేసి ఆ కాన్ఫరెన్సుకు పంపి బహుమతిపొంది వున్నాడు. శివయ్య గొప్ప శిల్పి. నేతలో కుట్టులేకుండా పరాయి చొక్కా మొదలైనవి చిత్రములైన పనులు ఎన్నో చెయ్యగలడు. అతడు జరీలతలుతీర్చి నేసిన చీరె రాణులుసహా చూస్తే తలలూపి కట్టితీరవలసిందే. అటువంటి శిల్పాలకు ప్రోత్సాహం లేనందున శివయ్య అవి మానివేసి మామూలు బట్టలే నెయ్యడానికి పాల్పడ్డాడు. అందులోనూ అతనికి భుక్తి జరగడంలేదు. ఆ కార్డు చూసేసరికి వెనుకటి స్మృతులు గుర్తుకురాగా అతడు విచారంలో మునిగి పోయ్యాడు.

రావు వచ్చాడు. అతన్ని చూడగానే సీతమ్మ లేచి యింట్లోకి వెళ్ళిపోయింది. శివయ్య ''నమస్కారం రండి రావుగారూ ?'' అంటూ పీటతెచ్చి వెయ్యగా రావు కూర్చున్నాడు. రావు పట్టణకాంగ్రెసు. సంఘ అధ్యక్షుడు గ్రామంలో పలుకుబడి వున్నవాడు.

"ఇలా దయచేశారు! మా యోగక్షేమాలు విచారించడానికి వచ్చారా? తిండిలేక పిల్లలూ మేమూ అలమటించి పోతున్నాం" అన్నాడు శివయ్య.

"అలాగా! పత్రికల్లో చూస్తూనే వున్నాం" అన్నాడు రావు.

"మా అవస్థ చెప్పడానికి వీల్లేదు. వెనక నూలు దొరకక చాలినంత పనిలేక పస్తులుచేశాం. ఇప్పుడు ఎట్లాగో ఒకలా నూలు దొరుకుతూన్నది. గాని నేసినబట్ట ఖర్చుగాక మగ్గానికి పడుగు యిచ్చేవాళ్లు లేక యిప్పుడు పస్తులు వుంటున్నాం. నూలు దొరికినప్పుడూ దొరక్క పోయినప్పుడూ కూడా ఆఖరికి ఫలితం ఒకటే అయింది. మిల్లు బట్ట మా పరిశ్రమను కూలదోసింది" అన్నాడు శివయ్య.

"అయితే యీమధ్య చీరెలు ధోవతులు ప్రభుత్వం వారు మీకు కేటాయించే ఆలోచనలో వున్నారని పత్రికల్లో చదివాం" అన్నాడు రావు.

"ఏమి కేటాయించడమో యేమిటో! ప్రభుత్వము మిల్లులతో యే నిబంధనలనైనా ఏర్పరచుకో నివ్వండి. మొత్తం మీద మాకు పనిచూపి అన్నం బట్ట కలిగించడం ప్రభుత్వం విధి. స్వరాజ్యం స్వరాజ్యం అని బంగారు కలలు కన్నాం. ఇదివరకు బ్రిటిషువాళ్ళ పాలనలో వున్నప్పుడు ఘోశా మజిలీలు, చీరెను వుంగరములో దూర్చిన కథలు

చెప్పుకుని పరాయిప్రభుత్వమువల్ల యిటువంటి పరిశ్రమలన్నీ నాశనమై పోయాయని వాపోయ్యాం. ఇప్పుడు స్వంత ప్రభుత్వం వచ్చిమాత్రం యేం చేసింది ? ఖద్దరు వస్త్రాలతో ప్రారంభమైన స్వరాజ్యోద్యమం తీరా స్వరాజ్యం వచ్చిన తరువాత నేతగాళ్ళకు తినడానికి తిండి లేకుండాపోయింది.'' చెపుతూవుంటే అతని గుండెల్లోనుంచి ఆ వేదన పొంగు కొస్తోంది.

'' అట్లా చూడండి నాబిడ్డ అనం అన్నం అని ఏడ్చి శోషవచ్చి పడిపోయింది. మే మెందుకు యిట్లా పస్తులు వుండాలి ? నేరాలుచేసి జైళ్ళలో పడ్డవాళ్లను గూడా ప్రభుత్వం పస్తులు వుండనివ్వదే! మేము ఎందుకు పస్తులు చెయ్యవలసి వచ్చిందని ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను. నేనేం సోమరిపోతునా ? పనివుంటే పిల్లలూ మేము తిని ఒకళ్లకు యింత పెట్టగలను '' అన్నాడు శివయ్య.

'' అవును పాపం ! మీ అవస్థ చూస్తే విచారం వేస్తున్నది. ప్రభుత్వం యేదో ఒకటి చేస్తుందిలే. సరే కాని నూలు చిలప ఒకటి కావలసి వచ్చింది కాస్తవుంటే చూద్దూ '' అన్నాడు రావు.

శివయ్య ఆవేదనతో '' అందుకా తమరు దయ చేసింది ! గొంతుకు ఉరేసుకునేందుకైనా ఒక పోగు లేదు. మీకుపుణ్యం వుంటుందిగాని మాకే సహాయం చేసిపెడుదురూ. మీరంతా ప్రభుత్వంచేత మాకు చాలినంత పనైనా

చూపించేటట్లు చేయండి. లేదా సునాయాసంగా చచ్చిపొయ్యే టందుకు మందైనా సప్లయి చేయించండి.'' అన్నాడు. అంతటితో రావు వెళ్లిపొయ్యాడు.

రాఘువయ్య వచ్చాడు. యీయన శివయ్య తమ్ముడు. అక్కడకు పదికోసుల దూరంలో వున్న ఓ పల్లెవాళ్లది. లాంఛనప్రకారం కాళ్లకు నీళ్ళివ్వగా రాఘువయ్య కాళ్లు కడుక్కుని కూర్చున్న తర్వాత శివయ్య యథాలాపంగా అక్కడ మీ పరిస్థితులు యెట్లావున్నయిరా అబ్బాయి ?'' అని అడిగాడు.

'' ఏం చెప్పమన్నా వన్నయ్యా అక్కడ మా సహకార సంఘంలో పడుగులు యివ్వడం మానివేశారు. సరుకు నిలవుండి పోయిందట. పని లేక నానా అవస్థపడు తున్నాను. జరుగుబాటు లేక చాలామంది ఇతర గ్రామాలకు వెళ్లిపొయ్యారు. మేమూ మీ వూరు రావాలను కుంటున్నాం. నిన్ను కనుక్కుపోదామని వచ్చాను'' అన్నాడు రాఘువయ్య.

'' ఇక్కడ పరిస్థితులు అంతకంటే అధ్వాన్నంగానే వున్నవి. రోలువెళ్ళి మద్దెలతో మొరపెట్టుకున్నట్టున్నది '' అన్నాడు శివయ్య.

తమ్ముడితో మాట్లాడుతున్న శివయ్యను యింట్లో నుంచి భార్య పిలవగా లేచి వెళ్ళాడు. '' పై మనిషి వున్నాడుకదా ఆయనకు భోజనం యెట్లా ?'' అన్నది.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను." అన్నాడు భర్త.

"షావుకారు దగ్గిర అవసరమని చెప్పి ఓ రూపాయి పట్టుకరాండి. పెద్దపిల్ల శోషవచ్చి పడిపోయింది, చిన్నది గోలచేస్తున్నది" అన్నది భార్య, బాధతో.

"ఇదవరకే కొంత వాడుకున్నాం. ఏమిస్తాడో యేమిటో. అయినా వెళ్ళివస్తాను" అంటూ షావుకారు యింటికి వెళ్ళాడు శివయ్య. అతడు మాస్టరు పీవరు అరవై, డెభ్భై మగ్గాలు నేయిస్తాడు. శివయ్య వెళ్ళేసరికి షావుకారూ మరి ఒక ఆసామీ ఘర్షణపడుతున్నారు. ఆ ఆసామి నూలు షావుకారు. "నూలు తీసుకెళ్ళి యిన్ని మాసాలైనా డబ్బు యివ్వవేం?" అని యిల్లెగిరిపొయ్యేటట్లు కేకలు వేస్తున్నాడు. ఏంచెయ్యమన్నారు? సరుకు నిల వుండిపోయింది. అమ్మగానే యిస్తానని చెపుతున్నాడు షావుకారు.

అది చూసి శివయ్య అడక్కుండానే యిల్లు చేరుకున్నాడు. వచ్చిన చుట్టంపనిమీద ఎక్కడికో వెళ్లాడు. భర్తను చూడగానే "తెచ్చారా?" అని ఆశతో అడిగింది భార్య. "లేద"ని బదులు చెప్పాడు శివయ్య.

ఆమె కళ్ళవెంట నీళ్లుకారుస్తూ "అయ్యో! యెట్లాగు చిన్నపిల్ల కూడా శోషవచ్చి పడిపోయింది. మీరు యిక్కడ వుండండి ఎవరి కాళ్ళయినా పట్టుకుని గింజలు తెస్తాను" అంటూ సీతమ్మ లేచి గబగబా వీధిలోకి వెళ్ళిపోయింది.

కాస్సేపటికి సీతమ్మ తిరిగి వచ్చింది కొంగునవున్న మూట చూసి శివయ్య "గింజలు తెచ్చావు! అయితే త్వరగా వుడకెయ్యి" అన్నాడు.

ఆమె కంపితకంఠంతో "యేం వుడకెయ్యమన్నారు! గింజలు దొరకలేదు. మీకు చెప్పకుండా నేనో పనిచేశాను" అన్నది.

"ఏంచేశావు యేమిటి?" అని ఆదుర్దాతో అడిగాడు శివయ్య.

సీతమ్మ కళ్ళవెంట నీళ్లుకారుస్తూ "యేం చెయ్యను. నాలుగిళ్లు మాదాకవళం అడిగి తెచ్చాను" అన్నది.

శివయ్య తొట్రుపాటుతో "ఏమిటి మాదాకవళమా! వీడు బ్రతికివుండగానే మాదాకవళం అడుక్కొచ్చావా? వీడి శరీరం మంటలో కాలిభస్మం కాకముందే నువ్వు జోలికట్టావా? అవును. నీ తప్పేమున్నది. వీడు బ్రతికివుండి చచ్చినవాళ్ళలో జమే అయ్యాడు" అని ఆక్రోశించాడు.



# కొత్త మేడ

వీరబసవయ్య యింట్లో లేడు. సంఘంలో ఎవరో లేచి పోయిన మనిషిని యింట్లో తెచ్చిపెట్టుకున్నారని తెలిసి వాళ్ళమీద దండెత్త బోయ్యాడు. అతని వితంతు కూతురు గిరమ్మ శ్రావ్యంగా పాడుతుంది. యిరుగూ పొరుగు అమ్మ లక్కలు నలుగురూచేరి ఆ అమ్మాయిచేత పాడించుకుని వింటున్నారు.

వీరబసవయ్య ధనవంతుడేమీ గాకపోయినా వాళ్ళ సంఘంలో అతని మాటంటే విలువజాస్తి. అవతల వాళ్లను గురిలోపెట్టి, అరిచి కళ్ళెఱ్ఱబడ వేసుకుని వీరబసవయ్య తిరిగి యింటికి వచ్చాడు. అతడు వీధిగుమ్మంలో కాలుపెట్టేసరికి లోపలనుంచి కూతురి పాట సూదుల్లాగా చెవులకు సోకింది. అతని వళ్లు కంపమెత్తి పోయింది. అక్కడనుంచే రంకె పెట్టాడు. కోర మీసాలూ, పెద్దచ్ఛాతీ, మనిషి యాభై యేళ్ళ వాడయినా కేక వేస్తే రెండు మైళ్ళవరకూ వినబడు తుంది. ఆ కేకకు అక్కడకూర్చున్న ఆడ వాళ్ళంతా బెబ్బులి అరుపువిన్న లేళ్ళలాగా చెదరిపొయ్యారు. వీరబసవయ్య లోపలకువెళ్ళి కూతుర్ని మొఖం వాచేట్లు చీవాట్లు పెట్టాడు.

సంగీత జ్ఞానం పుట్టుకలో కలగవలసిందే గాని ఒకరు నేర్పితే అబ్బేది కాదు. అందులో పురుషులకంటే స్త్రీల గాత్రం మెరుగు, వారిలోనూ గాత్రంలో మాధుర్యమూ,

పాటలో జిగీ అందరికీ అలవడదు. గిరమ్మకు ఆ రెండు లక్షణాలూ అలవడినవి. అయితే ఏం లాభం? తండ్రి ప్రచండుడు! వితంతువంటే కొందరి దృష్టిలో ముడిపదార్థం! కొంతవరకు ఫరవాలేదు. మరికొందరిదృష్టిలో జడపదార్థం! కూర్చికోవచ్చు. వీరబసవయ్య దృష్టిలోమాత్రం అపాయకరమైన ప్రేలుడు పదార్థం! కూతుర్ని గొంతు మెత్త నివ్వడు. వీధి గుమ్మం తొక్కనివ్వడు. సముద్రంలోవున్న ఆణిముత్యములు; భూగర్భంలో యిమిడివున్న మణులు, తాళపత్రములలో మరుగు పడివున్న పూర్వ వాఙ్మయము, అస్వతంత్రులలోవున్న లలితకళ, యివన్నీ దానివాళ్ళు గుర్తించ నంతవరకూ వాటి ఉజ్వల భవితవ్యం అట్లా, అజ్ఞాతంగా వుండిపోవలసిందే.

౨

గిరమ్మ జీవిత పరిమాణంలో నాలుగో వంతయినా ఖర్చుకాలేదు. పొంగిపొరలే వుత్సాహం, వెల్లివిరిసే వుద్వేగం. ఆ రోజున తండ్రీ, అన్నా పనిలోకి గావును వెళ్ళారు. వదిన దొడ్లో ఏదో పనిమీదవున్నది. గిరమ్మ యింటితలుపు ఓరగా వేసింది. పొరుగింటావిడ చుట్టియివ్వమని యిచ్చి వెళ్ళిన సన్నజాజుల చెండు తల్లో అమర్చుకున్నది. పెట్టెలోవున్న వదిన లోలకులు చెవులకు పెట్టుకున్నది. అద్దంముందునిలబడి కళ్ళుతిప్పుతూ, చేతులతో అభినయిస్తూ నృత్య భంగిమలో నిలబడి మెల్లగా ఏదో ఆలాపిస్తున్నది.

ఇంతలో తలుపు నెట్టుకుని పిడుగులాగా తండ్రి వచ్చి పడ్డాడు. గిరమ్మ పై ప్రాణం పైకి లేచిపోగా, గబగబా తల్లో చెండు లోలకులు తీసి వేసి నిర్జీవప్రతిమలా, తలవంచుకుని నిలబడిపోయింది. వీరబసవయ్యకు కూతురి వేషం చూసే సరికి ఒళ్ళు తెలియని ఆవేశం కలిగింది. "నీకదేం మాయ రోగమే దెయ్యమా?" అంటూ వీపుమీద ఒక చరుపు చరిచాడు.

గిరమ్మ దుఃఖంతో ఒక మూల చాపమీద పండుకున్నది. ఆ పడక పడక మర్నాడు కూడా లేవ లేదు. అన్నమూ, నీళ్ళూ లేవు. అన్నా, వదినా ఎంత చెప్పినా లేవ లేదు. గిరమ్మ తల్లిని కోల్పోయి చాలా కాలమయింది. తండ్రి కూతుర్ని లెమ్మని అననైనా లేదు. ఆమె కదే శిక్షని తృప్తిపడి వూరుకున్నాడు.

మూడవరోజు తెల్లవారేసరికి గిరమ్మ ఇంట్లో లేదు. తండ్రీ, అన్నా తత్తరపాటుతో వూళ్ళో బావులూ చెరువులూ వెదికారు. ఎక్కడా, ఆనవాలు లేదు. గ్రామంలో యీ వార్త గాలికంటే వేగంగా పాకిపోయింది. ఎవర్నో తీసుకుని లేచిపోయిందని కొందరూ, దేనిలోనో పడి ఆత్మ హత్య చేసుకుందని కొందరూ, ఎవరికి తోచినట్లు వాళ్ళు రెండురోజులపాటు గుంపులుపడి విడ్డూరంగా చెప్పుకున్నారు. వీరబసవయ్యమాత్రం నాలుగు రోజులపాటు వీధిచాయల ముఖం చూపించకుండా ఇంట్లో ముసుగ దీసుకుని కూర్చున్నాడు.

## ౩

కాలం పదిసంవత్సరాలను చెరుకులా నమిలివేసింది. వీరబసవయ్య బేలుదారి మేస్త్రీ అతనికొడుకు కూడా తండ్రి వృత్తినే అవలంబించాడు. తండ్రీ కొడుకులు చుట్టుపట్ల నలభై యాభై మైళ్ళవరకూ వెళ్ళి పనులు చెయ్యటం కద్దు. ఒక షావుకారు మేడ కట్టిస్తూవుండగా తండ్రీకొడుకులు తెనాలివెళ్ళారు. ఆమేడ పూర్తిఅయిన మీదట వాళ్ళకు అక్కడనే మరోమేడకు పనికలిగింది. అది ఒక సినిమా తారది. మేడ మంచి ఫేషన్‌గా కడుతున్నారు, గోడలు లేచినవి.

వీరబసవయ్య ఎక్కడున్నా ఒకళ్ళకు లొంగే ఘటంగాని, ఒకళ్ళచేత మాట అనిపించుకునే ఘటంగాని కాదు. అక్కడా పనివాళ్ళందరిమీదా అతనిదే పైచేయి. తానుఖచ్చితంగా పనిచేస్తాడు. ఇతర్లచేత చెప్పి చేయిస్తాడు. ఆరోజున పనివాళ్ళంతా ఎవరి పనుల్లో వాళ్లు నిమగ్నులై వున్నారు. ఒక కారువచ్చి కట్టడంముందు ఆగింది. పని వాళ్ళంతా ఒక నిమిషం పని ఆపి అటువైపు దృష్టులు సారించారు. అందులోనుంచి ఒక యువతీ, ఒక యువకుడూ దిగి, కట్టడంలోకి వెళ్ళారు. "అదిగో యజమానురాలు, అదిగో యజమానురా" లని పనివాళ్ళల్లో గుసగుసలు రేగినవి. వాళ్ళిద్దరూ కట్టడం నలుమూలలూ పరిశీలించి మళ్ళా. కారెక్కి వెళ్ళిపొయ్యారు. వీరబసవయ్య తండ్రీ

కొడుకులు దక్షిణంవైపు ఆర్చిపని చేస్తున్నారు. "యీ వెణ్ణి ఎక్కడో చూసినట్టుందిరా!" అన్నాడు తండ్రి కొడుకుతో.

"ఎక్కడేంటి నాన్నా? మొన్న సినిమాలో, చూశాంకదూ, అందులో నాయిక వేషం వేసిం దీవడేగా!" అన్నాడు కొడుకు.

సరసన పనిచేస్తున్న ఆ గ్రామవాసి అయిన మరో కతను వీళ్ళ మాటలు విని సగర్వంగా అన్నాడు. "మీరా అమ్మాయిని సినిమాల్లోనే చూస్తారు. మేం ఎల్లప్పుడూ చూస్తూనేవుంటాం." క్షణం ఆగి మళ్ళా అన్నాడు. "అబ్బ! అదృష్ట మంటే యీ అమ్మాయిదే చెప్పాలి. యింకా కాస్త ఆలస్యమైతే గోయిందా అని ఏ మొసలి పొట్టలోనో పడిపొయ్యేది. ఈసినిమాలు, గినిమాలు ఎటుపొయ్యేవో!" అన్నాడు.

ఆశ్చర్యంతో, "ఎందుకని?" అని అడిగాడు వీరబసవయ్య చేస్తున్న పని నిలిపి. అవతల అతను చెప్పాడు. అసలు యీ అమ్మాయిది తూర్పున ఏదో ఊరంట; మనకు తెలియదు. చెప్పుకుంటారు. ఆ అమ్మాయికి ఎవళ్ళయినా వున్నారో లేరో! కిష్టలో పడాలని కిష్టవొడ్డున కూర్చుని ఏడుస్తుందంట! ఆ సమయానికే అటు పోతున్న ఎవరో పున్యాత్ముడు ఆ ఏడుపు విన్నాడంట! విని ఎట్లా కనిపెట్టాడో ఏంటో ఆ ఏడుపులో సంగీతం కనిపెట్టాడంట. యింటనే ఆయన ఆ అమ్మాయి దగ్గరకి యెళ్ళి మతి మళ్ళించి బుజ్జగించి

యింటికి తీసుకు వెళ్ళాడంట. ఆయన సినిమాలు తీస్తాడంట సంగీతమన్నా, దిక్కూ మొక్కూ లేనివాళ్ళన్నా ఆయనకు తగని ప్రేమంట! ఆ అమ్మాయిగూడా ఆయిన్నే తండ్రని నమ్ముకుని వుండి పోయిందంట."

చేష్టలు దక్కవింటున్న వీరబసవయ్య చేతిలో టోపీ పట్టువదలి క్రింద పడిపోయింది. అవతల అతను చెప్పుకెళు తున్నాడు. "ఆయన ఆ అమ్మాయికి సంగీతం నేర్పించి పైకి తీసుకొచ్చాడు. యిప్పుడు గిరిజకుమారంటే పేరు మోగి పోయింది. గొంతెత్తితే వేలు కురిపిస్తున్నారు. బోలెడు డబ్బు సంపాయించింది. కాపరం వుంటున్న మేడ ఒకటి; యిప్పుడు కడుతున్న దొకటి. కాక బాంకీలో డెభ్భై యనభై వేలు నిలవున్నయంట. చూడండీ యింత పేరూ, యింతడబ్బు ఆమెకు దక్కాల్సి వుండగా ఆనాడు యట్లా కిష్టలో పడుతుంది ?" అని చెప్పి ముగించాడు.

"అయితే చావు ఆ అమ్మాయికి ఎంత సహాయం చేసింది ?" అన్నాడు అవతల పనిచేస్తున్న ఒకతను.

"ఆమెకే కాదు మావా! మనక్కూడా కొంత మేలు జరిగింది! యీ మేడ గూడా మొసలి కడుపులో కూచునేదేగా ? మనకూ నాలుగు రోజులు భత్యాలు"... అని అందుకున్నాడు అవతల వేరొకతను అందరూ నవ్వారు. వీరబసవయ్య మాత్రం నవ్వలేదు. వాళ్ళు అనుకున్న

మాటలు గూడా అతని చెవుల కెక్కలేదు. మనిషి పరధ్యానంలో వుండిపోయ్యాడు.

ఇంతలో మళ్ళా ఆ కారువచ్చి కట్టడం ముందు నిలబడ్డది. పనివాళ్లంతా మళ్ళా ఆమె ఎందుకు వచ్చిందా అని చూపులు అటువైపు మళ్లించారు. అందులో ఎవ్వరూ లేరు. వట్టికారు వీరబసవయ్య తండ్రీ కొడుకులను ఎక్కించుకుని తూనీగలా వెళ్ళి ఓ భవనంముందు నిలిచింది. డ్రైవరు ఇద్దర్నీ లోనికి తీసుకువెళ్ళాడు. వీరబసవయ్య కూతుర్ని చూసి ఆనంద సంభ్రమాలతో "ఎంతదాని వయ్యావే! నా తల్లీ?" అంటూ ఆలింగనం చేసుకున్నాడు.

వీరబసవయ్య కుటుంబం ఇప్పుడుదర్జాగా! కొత్తగా తయారైన మేడలో నివసిస్తున్నది. వీరబసవయ్య మీసం మెలివేస్తున్నాడు. ఎక్కడున్నా అతనిది పైచేయే!.



# 'నువ్వు కాదూ....?'

మధ్యాహ్నం వంటిగంట వుతుంది. రామస్వామి వాకిటిముందు బండి ఆపి ఎడ్లను విడిచిపెట్టి, వీధిలోనించే "ఇదోవ్!" అని భార్యను కేక వేసుకుంటూ ఇంట్లోకి నాలు గంగలుపెట్టి "నిన్న పొద్దు నసంగా తిన్నన్నం. కళ్లు తిరిగిపోతున్నయ్, తెల్లారింకా పచ్చిగంగైనా తాగ లేదు, ఇంత పాడు బాడిగ ఎప్పుడూ తోల్లేదు. దబ్బున వీపుమీద రెండు చెంబులు నీళ్లుపోసి కంచంలో రెండు మెతుకులు వెయ్యే" అన్నాడు విసుగ్గా.

భార్య "అయ్యో! నిన్నట్నుంచీ అన్నం తిన లే!" అంటూ త్వరత్వరగా వీపుమీద నీళ్లుపోసి దబ్బున వళ్లు తుడుచుకోమని తొందరచేసి భర్తకు అన్నం పెట్టింది.

యెడ్లు రెండూ చావట్లోకి వెళ్ళినవి. ఒకటి పుల్లదీ, ఒకటి తెల్లదిన్నీ. పుల్లది బక్కచిక్కి ఎముకలు బయటపడి వున్నది. తెల్లది దానికంటే కొంచంనయం. అవి గూడా మేత తిని ఒక రోజయింది, వాటికికూడా ఆకలి విపరీతంగా వేస్తూవుంది. పుల్లది త్రాణ లేకపోవడంవల్ల ఆకలికి నిలవలేక మరీతపించిపోతూవుంది. చెవులు దిబ్బెళ్ళుపడుతున్నవి. కాళ్లు భూమ్మీద ఆనటంలేదు. గాట్లో చూసింది, మేత లేదు. ఏది కనపడితే అది తిని వెయ్యాలనిపించింది దానికి.

తింటామని చావడికప్పు తాటాకు నోటితో లాగింది. అది ఎన్ని సంవత్సరాలనాటిదో, కుళ్ళి వుండడంవల్ల పట్టుతో గానే చూర్ణమయి పోయింది. ఎదురుగా అన్నంతింటూ యజమాని కనిపించాడు. దానికి ఒళ్ళు మండిపోయింది. "ఏం నీతోపాటేగా మేమూ తిన్నది. హాయిగా బండి మీద కూర్చున్నవాడికి నీకే అంత ఆకలివేస్తే గుండెలు పడలాగిన మాకు ఎట్లా వుండాలి?" అన్నట్టు అతనివంక చురచుర చూసింది. ముద్దమీద ముద్ద పొక్కుతూ అతని గొడవలో అతడున్నాడు. గానీ. వీటి సంగతి అతనికి పడితేగా మరి. కొంచందూరాన పచ్చగా చిక్కుడు పాదొకటి కనిపించింది దానిపంచ ప్రాణాలూ లేచివచ్చినవి.

రామస్వామి తృప్తిగా భోజనంచేసి తేపుకుంటూ చెయ్యి కడుక్కునేటందుకు ఇవతలకు వచ్చాడు.

పుల్లది చిక్కుడుపాదు తింటూవుండడం చూశాడు అతనికి కోపం ఎక్కిపోయింది. దొంగ ధనాన్ని దోచుకు వెళ్ళుతూవుంటే కర్రలు తీసుకుని వెంట తరిమినట్లు చేతులో చెంబు అక్కడనే పడనేసి ఎంగిలి చేత్తోనే గోడకు పెట్టివున్న కర్ర పుచ్చుకుని ఒక్కఉరుకు దూకి "బంగారంవంటి పాదు నీ పొట్టన పెట్టుకున్నావ్!" అంటూ ఈడ్చి ఈడ్చి రెండు వేశాడు.

కోపంతో ఎద్దు పాములాగా బుసలుకొట్టింది "బండి లాగిలాగి ఒళ్ళంతా హూనం అయివుంటే పైగా కొడతావా

దుర్మార్గుడా! ఆకలికి ఆగలేక రెండు ఆకులు కొరికితే నీ సొమ్మంతా పోయినట్లు బాదుతావా రక్కసుడా! నీ ప్రాణంవంటి ప్రాణంకాదూ నాది? నీ ఆకలివంటి ఆకలి గాదూ నాది? కష్టించి దున్ని పండిస్తే సారంఅంతా మీరు తీసుకుని మీకు పనికిరాని చెత్తను మాకు వెయ్యడాని కూడా నీకు కష్టమైపోయిందా? నువ్వు మేతవేస్తే నేనీ పనెందుకు చేస్తాను. అంతమాత్రం తెలుసుకోలేవు మూర్ఖుడా" అని కళ్ళతో అన్నది యెద్దు.

అతడది గ్రహించుకోకుండా బాదుకుంటూ చావట్లోకి తోలుకవచ్చాడు. "ఎప్పుడు వేశానో వాటికి మేత వెయ్యి" అన్నది భార్య యింట్లో నించి. "దీన్ని నిలువునా తెగేసినా పాపంలేదు. పాదంతా తినివేసింది, కడుపు మురిగినట్టుంది. ఎంత పొగరుందనుకున్నావు దీని దగ్గిర. మేతవేస్తే ఇంకా మదం దిగుతుంది" అంటూ చెయ్యి కడుక్కుని రామస్వామి ఇంట్లోకి వచ్చి "కాస్త పక్క వెయ్యి, వుండివుండి తినడంవల్ల నిస్త్రాణగావుంది. కాళ్లు లాగుతున్నవి. నిద్ర జోగివస్తున్నది, కళ్లు మూతలు పడిపోతున్నవి" అన్నాడు.

భార్య భర్తకు పక్కవేసి చావట్లోకి వెళ్ళి రెండు ఎడ్లకూ పలుపువెట్టి ఇంత యెండుగడ్డి వాటిముందు వేసింది,

౨

ఆ తెల్లవారి శ్రీరామనవమి. రామస్వామి బజారు నుంచి రెండుమూడు పెద్దమూటలు బుజాన వేసుకుని ఇంటికి వచ్చాడు. ఆ మూటలను తెల్లదీ, పుల్లదీ చూసి తమ దానా వులవలని సంతోషపడ్డవి. "ఇదిగో వెచ్చాలు తెచ్చాను రాములవారికి ఇవ్వాళ మనం సేవచేద్దామని వాళ్ళతో చెప్పివేశాను. నిన్న వచ్చిన బాడుగ మూడు రూపాయిలూ స్వామివారి ఫలహారాలకు కానీ మిగలకుండా సరిపోయినవి. సమయానికి బాడుగ రావడం, ఇంత జనం వుండగా మనచేతనే సేవచేయించుకోవడం రాముడి దయ మనమీద యెలావుందో చూశావూ? ఎన్నాళ్ళనుంచో అనుకుంటాను సేవ చేయించాలని. మన ప్రయత్నాలక్కరకొస్తయ్యా మరి? వాడి అనుగ్రహంవస్తే చూడు ఎంతసేపో. ఈ గింజలు విసిరి నానపొయ్యి వడపప్పుకి. ఈ బెల్లందాయి పానకానికి" అన్నాడు భార్యతో.

పూజాద్రవ్యాలు సేకరించడానికీ, పిలవ్వాసిన పెద్దలను పిలవడానికీ, ఎంతో వుల్లాసంతో వురుకులుపరుగులు తీస్తున్నాడు రామస్వామి.

దీపాలు వెలిగించి ఒక గంటయింది. వేళ అవడంవల్ల రెండు ఎడ్లూ దానాకోసం ఎదురుచూస్తున్నవి. ఎంతసేపు చూసినా దానారాలేదు. వేళకు నల్లమందు వేసుకోని వాడిలాగా వాటికాళ్లు లాగుతున్నవి. వాటి బాధ ఎవరితో

చెప్పుకుంటవి? ఎలా తెలియజేస్తవి? ఆలకించే దెవరు? మనిషిపొడ కనపడితే చాలు బాధలో వున్నవాడు ఆప్తుడు కనపడితే చూసినట్టు ఎంతో ఆశతో దీనంగా చూస్తూ వున్నవి.

రాత్రి ఎనిమిది గంటలయింది. రామస్వామి భజన శేట్టుచూ, రాములవారినీ తీసుకుని యింటికి వచ్చాడు. మద్దెలా, తాళాలూ, భజనపరుల నోళ్లూ పగిలిపోతున్నవి. "జీవుడూ దేవుడూ ఒకటే జీవులను హింసించకే మనసా" అన్న కీర్తన త్రికాలంమీద వెళ్ళిపోతూ వుంది. ఆ ధ్వనికి ఇంటి పెంకులు అదిరిపోతున్నవి. జీవితంలో చేయవలసిన ఘనకార్యం అదే అన్నట్టు. రామస్వామి ఉప్పొంగిపోతూ వినమ్రుడై దండలుకట్టి స్వామికి ఎదురుగా నిలుచుని అందరికీ భక్తిని ప్రదర్శిస్తూ ఆనందబాష్పాలు రాలుస్తున్నాడు.

అక్కడ తెల్లదీ, పుల్లదీ, వుసూరుమంటూ వేడి కళ్ళనీళ్ళు కారుస్తూ, మనగతి ఇంతే అన్నట్టు ఒకదాని ముఖం ఒకటి చూసుకుంటున్నవి.

ఫలహారం, పానకం పంచడం అయింది. భక్తులందరూ వెళ్ళిపోయ్యారు. అప్పుడు రాత్రి పదిన్నరగంట లయింది. భర్తకు అన్నం పెడుతూ "అయ్యో! ఇవ్వాళ ఎడ్లకు వులవలు తేలేదు, ఈ సందట్లో మర్చిపొయ్యావు. నేనూ చెప్పడం మర్చిపొయ్యాను, ఇప్పుడు గుర్తువచ్చింది. పాపం అవి వుసూరుమంటూ వుంటవి" అన్నది భార్య.

"నాకు గుర్తేవున్నది. డబ్బులేనప్పుడు ఏంచేస్తావు, వున్న డబ్బు కానీ మిగలకుండా ఫలహారాలకు సరిపోయె. ఒకరోజు లేకపోతే ఫరవాలేదులే. రోగమా! ఇటువంటి రోజు రేపురమ్మంటే మళ్ళీ మనకు వస్తుందా? స్వామికి ఎంత ఖర్చుపెడి తేలంతా మనకు కలగజేస్తాడు. మనం చెయ్యవలసిన పనిచేశాం, తర్వాత రాముడి దయ" అన్నాడు.

"ధర వచ్చిందని మేత గూడా అమ్మేస్తివి. ఇంట్లో దండిగా పడివుంటే ఇటువంటి సమయంలో ఒకమేత ఎక్కువెయ్యొచ్చు. డబ్బుపెట్టికొన్న మేత చూసి చూసి వాడవలసివచ్చె" అన్నది భార్య.

అప్పుడు అమ్మివెయ్యబట్టేగా వడ్డీ డబ్బులూ అవీ కలిసి కుర్రవాడి పెళ్ళికి అక్కరకొచ్చినయ్ సంసారం గొడవలు ఆడదానివి నీకేం తెలుస్తయి" అన్నాడు భర్త.

## 3

ఆ తెల్లవారి గుంటూరుకు బాడుగ వచ్చింది. బండి కట్టడానికి రామస్వామి, చావట్లోకి వెళ్ళి రెండు ఎడ్లనూ లేవగొట్టాడు. తెల్లది లేచి నిలుచుంది, వుల్లది లేవలేదు. "రాత్రి దాణాలేక కాళ్లుతీస్తున్నవి ఇవ్వాళ్ళకు నేనులాగలేనబ్బా" అన్నట్టు అతనివంక చూసింది. "ఎహై నీవెద్దు కూల లేవదేరా" అంటూ కసురుకున్నాడు రామస్వామి.

"నిస్త్రాణకుతోడు అర్రమీద పుండు కాకులు పొడవడంవల్ల ఎలా పచ్చయిందో చూడు. ఇట్లావుంటే ఎట్లా లాగడం. నీకు జాలిలేదు?" అన్నట్టు మెడచాచి పుండును చూపించింది పుల్లడి. "లేవదేరా, దీన్ని నరక" అంటూ కర్రతో ఒక్కవేటు వేశాడతడు. దానికి ఎక్కడ లేని కోపమూ వచ్చింది.

"కర్రపట్టుకో చాతవునని కొడతావా దుర్మార్గుడా! మీడొక్కలోకి గంజి యిస్తున్నది నేను. రారాజులకు రాజ్యాలిచ్చింది నేను. మీ ఐశ్వర్యాలన్నీ మా మల మూత్రాదుల్లోనించి వచ్చినవయ్యే, తెలుసా? మీరు వట్టి దుర్బలులని జాలిపడి మీ సౌఖ్యంకోసం మా దేహాలను త్యాగం చేసేటందుకు నిశ్చయించాం. తోడి ప్రాణాలను సంరక్షించి మా జీవితాలను పవిత్రం చేసుకోడానికి దీక్ష పూనాం. మహారాజుల రత్నమకుటాలైనా మా కాలిగిట్ట లకు సరిపోలవు, తెలిసిందా? మీరు స్వార్థపరులని యేనాడో గ్రహించాం. మా దేహాలను మనోవాక్కాయ కర్మల, ముందు మీకు సమర్పించివేశాం. మీరు కొట్టండి, కొయ్యండి–మా మాటను తప్పుకోలేం, మా శపథాన్ని వదులుకోలేం" అని తన సంజ్ఞలో తెలియజేస్తూ కోపాన్నంతా తగ్గించుకుని లేచి నిలబడ్డది. రెండిటినీ బండికికట్టి గుంటూరు తోలుకవెళ్ళి బండినిండా సరుకు వేసుకుని తిరిగి వస్తున్నాడు.

వెళ్ళేటప్పుడు కాళీబండి అవటంవల్ల హాయిగానే లాగినవి. వచ్చేటప్పుడు బియ్యం బస్తాలతో బండి పెటపెట లాడిపోతూవుంది. కాడి మెడమీద పెట్టడంతోనే పుల్లదానికి భారం అనిపించింది. అట్లాగే యీడుస్తూవున్నది. లాగడం ఆలస్యం అయితే పైనుంచి ముల్లుకర్రతో చెండుకు తింటు న్నాడు యజమాని. పౌరుషంతో తనశక్తిని వెయ్యోభాగం గూడా దాచుకోకుండా ఎన్నిమైళ్ళవరకొస్తే అన్నిమైళ్ళూ లాగివేసింది. ఇక దానివగ్గర చర్మం, ఎముకలుమాత్రమే మిగిలివున్నవి. లాగ లేక కూలబడిపోయింది.

తోట్లోనించి రామస్వామి అమాంతంగాదూకి చర్నా కోలతో బాదాడు. లేవలేదు. "నీ తస్సాదియ్యా; దొంగెత్తు వేశావు" అంటూ రెండు కర్రల సందునా తోకపెట్టి బలవంతాన అదిమి చిరతలు వేశాడు. సాంప్రదాయ ప్రకారం పెద్దలు సూక్ష్మబుద్ధితో యేర్పరచివుంచిన కర్మ కాండంతా జరిపాడు. బాధకు ఆగలేక వణికిపోయింది ఆ మూగజీవి.

"నన్ను చంపినా సరే, లాగలే"నన్నట్టు నోరు తెరిచి వూరుకుంది. తోడిప్రాణి దుస్థితిచూసి బిక్క మొగం వేసింది తెల్లది. దారినే పోతూవున్న రెండు ఆవులు అది పడే బాధచూసి అంబాఅని అరిచి సానుభూతి చెప్పివెళ్లినవి. మార్గమధ్యంలో బండి ఆగిపోయింది. అతని కడుపు మండి పోయి కసిదీరా చేతులోబలం వున్నంతవరకూ దాన్ని

క్రతో చితకపొడిచి వదిలిపెట్టాడు. "మీ మానవులు యింత రక్కసులా" అన్నట్టు చూస్తూ ఒళ్ళప్పగించి వూరుకుంది పుల్లది. గత్యంతరంలేక, బండినీ, ఎడ్లనూ అక్కడవుంచి ఒక్క పరుగులో దగ్గర పల్లెకువెళ్ళి ఒకళ్ళను బతిమలాడి ఎద్దును తీసుకవచ్చి బండికికట్టి వూరుచేరాడు.

౪

"పుల్లది ఎక్కడపడితే అక్కడ పండుకుంటున్నది. దాన్ని పెట్టుకుని నేనిక చెయ్యలేను బాబూ. ఇవ్వాళ్ళ యెంత అవస్థపడ్డా ననుకున్నావ్. దాన్ని పోగొట్టి మంచి దాన్ని కొనందె సాగదు" అని భార్యకు చెప్పి ఆ వేకువ ఝామునే పుల్లదాన్ని తోలుకుని పాలకుర్రు సంతకు వెళ్ళి ఇరవైరూపాయలకు అమ్మివేశాడు. మంచిదాన్ని కొనాలని సంతలో చూశాడు. అక్కడకు వచ్చినవన్నీ ఇటువంటి రకమే. తనకు నచ్చింది కనపడలా.

భోజనం వేళవడంవల్ల ఆ వూళ్ళో పాత చుట్టా లొకళ్లింటే కలవేసుకుని వాళ్ళింట్లో భోజనంచేసి ఎండగా వుండడంవల్ల ఒక కునుకుతీసి ఇంటికి బయలుదేరాడు.

మార్గమధ్యంలో వక పల్లెదాటాలి. కర్ర మెడమీద వేసుకుని రెండుచేతులూ వ్రేళ్ళాడవేసి ఆ వూరు వెలపలగా దారినే పడి పోతున్నాడు. రామస్వామినోట్లో చుట్ట దివిటీ లాగా వెలుగుతూ వుంది. దూరాన తోపులో చెట్లపైన గద్ద లాడుతూ కనిపించినవి.

అది యెందు కాడుతున్నదీ వూహించుకోవడం అతనికి అనవసరం. అతని మనస్సు ఏ వూరుపోతే మంచిగిత్త దొరుకుతుందీ, ఎంత ఖరీదులో దొరుకుతుందీ అని పని చేస్తూవుంది. యింకా కొంతదూరం నడిచాడు.

ఆ గద్ద లాడుతూవున్న స్థలంనుంచే కుక్కల కవర్లాటలూ, కత్తులమోతలూ, వినవచ్చినవి. ఏదైతే మనకేంలే అన్నట్టు తలవంచుకుని నడుస్తూ తోపును సమీపించి దాని గుండా బాటనే పడిపోతున్నాడు.

"ఏమిరొయ్యోవ్! ఎక పోగుకి బాటా వుంటా వంటియ్యా" అని కేక వినవచ్చింది. తలయెత్తి చూశాడు. కొంతదూరంలో చెట్టుకింద ఒక పశువు చంపబడివుంది. నలుగురూ దానిచుట్టూ మూగి వున్నారు. ఆ మాటలకు అతనికి కోపం నెత్తికెక్కి పోయింది.

కళ్లెర్రజేసి "యెవడనుకున్నావోయ్, వళ్లూ పై తెలియకుండా మాట్లాడతావ్" అని ఎగిరి పడ్డాడు.

అందులోనించి ఒకడు లేచి "అరేయ్, ఇంద కటాయర్రా, మనిసిని తెలుసుకోకుండా అడగడమేనంట్రా" అని ఆ కేక వేసినవాణ్ణి మందలిస్తూ "నొరగోయా కోప్పడకండి. కుర్రోడు తెలియక కూశాడు. యెదవను చీవాట్లు యేత్తుండాను" అన్నాడు.

పూర్వపరిచయం వున్నవాడిలాగా రామస్వామి అతన్ని చూసి గుర్తుపట్టాడు. అక్కడ తెగి పడివున్న తలకాయ చూశాడు. వంకర కొమ్ములు! ఉగ్రుడై పోయ్యాడు.

"ఛీ, గాడిదా! దాని ప్రాణం నిలువునా తీశావా? దాన్ని చంపేందుకు నీకు చేతు లెట్లా వచ్చినయ్‌రా వెధవా! నిండు ప్రాణం తీసేందుకు నీ మన సెట్లా వప్పిందిరా రాక్షసుడా! నీజాతి కొందికీ చేశావ్. యింత దుర్మార్గులు కనక నే అంటడానికీ ముట్టడానికీ కూడా పనికిరాకుండా పొయ్యారు" అని ఏ వేవో తిడుతూ మండిపడ్డాడు.

అక్కడ రక్తపు మడుగులో పడివున్న తలకాయ నాలిక వెల్లపెట్టి "నన్ను చిత్రవధ చేసిచేసి నా ప్రాణాలు హరించింది నువ్వుకాదూ?" అన్నట్టు కళ్లు తేలవేసి రామస్వామికేసి చూస్తూవుంది.

ఆ చూపులు ఎవరి కర్థమవుతవి, మరి?



# జీవకారుణ్యం

బొలీసుకు అనుకుని చొంగచేత్తో పుచ్చుకుని దమ్ము తీస్తున్నాడు మార్వాడీ. ఇంతలో అమీనా వారంటు మీద ఒక బాకీదార్ణి పట్టుకువచ్చాడు. బాకీదారుడు నీరుకావిబట్టలు కట్టుకుని మాసిన గడ్డంతో వున్నాడు. చింత, అవమానం, దిగులు, అతణ్ణి ముప్పురిన పెనవేస్తున్న సూచనలు ముఖంలో స్పష్టంగా కానవస్తున్నవి. నిశ్చేష్టుడై నిలుచున్నాడు మార్వాడీ యదట. అతణ్ణి చూచేసరికి తిప్పలు పెట్టిపెట్టి బోనులోపడ్డ మెకాన్ని చూసిన వాడిలాగా మార్వాడీకి సంతోషం, కోపం ఒక్కమారుగా కలిగినవి.

"చికాన్! బాకీ యిస్తావ్? జైలుకుపోతావ్?" అని గర్జించాడు పొగ గుప్పుగుప్పున వదులుతూ.

"సేటుగారూ! యిదేమి అన్యాయం? వడ్డీలకు వడ్డీలుకట్టి నాకొంప నిలువునా తీస్తివి. పొలమేదో వేసుకుంటివి. చాకిరిచేసి పిల్లల్ని బతికించుకోకుండా యిదేమి అన్యాయం?" అన్నాడు బాకీదారుడు.

"ఏయ్! బుద్ధి తక్కామాటల్ మాట్లాడబోకు. అన్యాయం యవర్ది? మంగల్ వాడిది. పొలం దానాధర్మం యిచ్చావ్? పొలండబ్బుపోను మిగతా బాకీ మొవడిబాబు సొమ్మనుకున్నావ్? నూటయాభైనాలుగు రూపాయల

పది అణాల ముక్కాని అక్కడ కట్టు లేదా జైలుకుపోతావ్ ''
అని పిడుగులు కురిపించాడు మార్వాడీ.

'' అట్లా మీరు మాట్లాడుతూవుంటే నేనేం చెప్పేది? పది హేను వందలు ఖరీదుచేసే పొలం తికమకలు చేసి కోర్టులో పదకొండు వందలకు కొట్టివేసుకుంటివి. అంతటితో తృప్తిపడి వూరుకోరాదు? పొలం పోవడంవల్ల జీవనాధారం పోయి చాకిరి చేసుకుని పిల్లలూ, మేమూ బతుకుతూవుంటే మళ్ళీ యిదేమ్ అన్యాయం? సేటుగారూ! ఆ స్థితి వేసుకున్నారు సరే! మనుషుల్ని కూడా వుండనివ్వరా ఏమిటండీ? ఇంతటితో నన్ను వదిలిపెట్టండి; మీకు పుణ్యం వుంటుంది '' అన్నాడు.

'' దొంగా మాటలు మాట్లాడబోకు. కడతావా సొమ్ము కట్టు లేదా జైలుకు పో. రెండే మాటలు '' అన్నాడు మార్వాడీ.

'' కట్టేటందుకు నా దగ్గర కానీ లేదు. యీ కరువులో యే రోజు భత్యం ఆ రోజు సంపాదించుకోవడమే కష్టంగా వున్నది. సొమ్ము నన్నెక్కడనుంచి తెచ్చి కట్టమన్నారు? దయవుంచి నన్ను వదిలిపెట్టండి. ఇంటివద్ద పిల్లలు చిన్నవాళ్ళు. ఆడమనిషి కాయిలాది. నేను లేకపోతే వాళ్ళు మలమల మాడిపోతారు '' అని దీనంగా అన్నాడు బీదకుటుంబి.

యిటువంటి దీనవాక్యాలు గ్రామఫోన్ ప్లేటులాగా వినివిని తడకలు కట్టివున్న అతని చెవులకు ఆ నిర్భాగ్యుడి మొర యేమి యెక్కుతుంది? "చెప్పేది నీకు గాదు? మనిసివి కావు? నీ టోకరాకు ఇక్కడ. యనరూ పడరు. రెండో మాట లేదు. కడతావా సొమ్ముకట్టు. హాయిగా యింటికిపోతావు. లేదా జైల్లోపడతావ్" అన్నాడు మార్వాడీ.

"ఇదుగో సేటుగారూ! నేను అబద్ధం ఆడేవాణ్ణి కాను. ఇంట్లో యీ రోజు గింజలుతప్ప కానీ లేదు. నా మాట నమ్మండి. బీదవాళ్ళం మమ్మల్ని యిబ్బంది పెట్టవద్దు. మీకు దణ్ణం పెడతాను నన్ను వదిలిపెట్టండి."

"జాంతానై. తల తాకట్టుపెట్టి తీసుకొచ్చి సొమ్ము కట్టు."

"ఆస్తిలేని వాడికి నాకప్పెవరిస్తారు సేటుగారూ? ఇంటివద్ద తల్లీ పిల్లలూ చచ్చిపోతారు. కనికరించి నన్ను వదిలిపెట్టండి. మీ పాదాలు పట్టుకుంటాను" చెమ్మగిల్లిన కళ్ళతో అన్నాడు. వుచ్చులో తగులుకున్న పక్షి తప్పించుకపోవాలని ఎంత గింజుకుంటే మాత్రం యేమి ప్రయోజనం?

మార్వాడీ వుగ్రుడై "జైలుకు తీసుకువెళ్ళు అమీనాగారూ! అప్పుడు గాని పీడిరోగం కుదరదు" అని కర్కశంగా అన్నాడు. అమీనా అతణ్ణి నడవమని చెయ్యి పట్టుకున్నాడు.

"నీకు దయాదాక్షిణ్యాలులేవూ ?" అతని గొంతు డగ్గుత్తిక పడడంవల్ల ఇక మాట్లాడలేక పొయ్యాడు. కళ్ళ వెంట రెండు నీటి బిందువులు బొటాబొటా భూమి మీాది కురికినవి. మార్వాడీ హృదయం కరగలేదు. నెమలికంటి నీరు వేటగానికేం ముద్దు? నిండుగా ప్రవహిస్తున్న ప్రవాహంలో ముష్టి చినుకులు యేమూాల కబురు? అమీానా అతణ్ణి నడవమని తొందర చేస్తున్నాడు. అతనికి దుఃఖంలో కోపం గూడా వచ్చింది. "నన్ను నా పిల్లలకు కాకుండా చేసి నువ్వేం బాగుపడతావు?" మార్వాడీని ఆ వక్క మాట మాత్రం అని దుఃఖంతో బరువెక్కిన గుండెలతో అమీానా వెంట అడుగులు వేస్తున్నాడా కష్టజీవి.

అదే సమయానికి బోయవాడొకడు పిట్టను చేత్తో పట్టుకుని బాజారునే వెళ్తున్నాడు. వాడిభుజం మీాద వుచ్చులకట్ట వ్రేళ్ళాడుతున్నది. చేతులోవున్న పిట్ట రెక్కలూ, కాళ్ళూ అంటగట్టబడి వున్నది. ఆ దృశ్యం మార్వాడీ చూశాడు. అతడు నిసలైన అహింసావాది. చలిచీమను సైతం తొక్కడు. తన రక్తాన్ని పానంచేసే నల్లులనుసైతం చంపడు. పిట్ట అట్లా రెక్కలు కాళ్ళూ, అంటగట్టబడి బాధ అనుభవించడం చూసి అతడు సహించలేక పొయ్యాడు. అదిన్నీగాక ఆ పిట్టను వాడు చంపుతాడు లేదా చంపేవాళ్ళకు అమ్ముతాడని కూడా అతని హృదయం తల్లడిల్లిపోయింది. పెద్ద కేకవేసి వాడిని పిలిచాడు. అ కేక

విని వాడు కంగారుపడుతూ వచ్చి "యేంది బాబు గోరు" అన్నాడు.

మార్వాడీ కోపంతో "అరే! నీకు బుద్ది లేదు? గేనం లేదు? దాన్ని పట్టుకుని యెందుకట్లా కట్టివేశావ్? కట్లువిప్పి వదిలిపెడతావా లేదా" అని దబాయించాడు.

"వొదిలిపెడితే" బువ్వ యట్టావత్తది బాబయ్యగోరూ అన్నాడా బోయవాడు. వెంటనే పావలా గిరవాటు వేసి వాడి చేతులోవున్న పిట్టను తీసుకుని కట్లు విప్పివేసి దాని ముందు గింజలు పోశాడా జీవకారుణ్యమూర్తి. రెక్కలూ, కాళ్ళూ, అంటగట్టిన రెండోది పక్షిలాగు మొఖం వేళాడ వేసుకుని అప్పుడే అమ్మినా నెంట గడపమెట్లు దిగుతున్నాడా దుఃఖజీవి. పిట్ట గింజలు ముట్టుకోలేదు. "మీజాతిమీద మీకు అభిమానం లేదా? ఇంతేనా మీ పస?" అన్నట్లు మార్వాడీ వంక చూస్తూ పిట్టరివ్వున ఎగిరి పోయింది ఆకాశానికి.



# మడ్డి రకం

అది రోహిణీకార్తె. ఉదయం పదిగంటలవుతుంది. పేల్చిన ఫిరంగిగుండులా సూర్యుడు సెగలు చిమ్ముకుంటూ మీదుగా పరుగెత్తుకు పోతున్నాడు.

పదహారేళ్ళయువతి నెత్తిన పెరుగుగంప పెట్టుకుని పొద్దునే పల్లెనుంచి పట్టణానికి పోతున్నది. ఆ అమ్మాయి వెనక పదిగజాల దూరంలో ఒక యువకుడు నడచి వస్తున్నాడు. పాతికేళ్లుంటవి. తెల్లటి ఇస్త్రీబట్టలు చేతికి రిస్టువాచి, చేతిలో లెదరుబేగు అన్నీ నవనాగరిక లక్షణాలు. అతనికి దాహం వేస్తూవున్నది. ఆ ప్రాంతంలో ఎక్కడా నీళ్ళులేవు. అతడు నాలుగు అంగల్లో ఆ యువతిని కలుసుకుని "ఇదిగో పిల్లా : దాహం వేస్తున్నది. కాసిని మజ్జిగ యిస్తావు ? " అన్నాడు.

ఆ అమ్మాయి "మజ్జిగలేదు" అంటూ, అతని చూపులు ఆ అమ్మాయివంటికి ముళ్ళుగా తగలడంచేత విసురుగా అడుగులువేస్తూ ముందుకు తూగిపోసాగింది–

అతడు ఆ అమ్మాయిని వెంబడిస్తూ "ఇదిగో పిల్లా : నాకు పూరికేవద్దు. ఖరీదు తీసుకో. గొంతు ఎండిపోతున్నది. కాసిని మజ్జిగ యిస్తూ" అన్నాడు–

"ఇది మజ్జిగకాదు పెరుగు" అన్నది ముఖం తిప్పుకుని ఆ అమ్మాయి

"అయితే లే పిల్లా! ఆ పెరుగేయివ్వు ఇదిగో ఈ అణాతీసుకో" అంటూ జేబులోనుంచి అణాతీసి యివ్వబోయ్యాడు—

ఆ అమ్మాయి పుచ్చుకోకుండా "యిచ్చేటందుకు వీల్లేదు; అక్కడ మాకు వాసుకలున్నవి" అన్నది.

"పిల్లా! పిల్లా! నీకు పుణ్యంవుంటుంది గొంతు ఆర్చుకుపోతున్నది. ఇంకో అణాకూడా ఎక్కువ యిస్తాను కాస్త పెరుగుఇస్తూ" అని జాలిపుట్టేటట్టు బ్రతిమాలాడు కానీ, ఆ అమ్మాయి మనసు కరగలేదు. అతనిమాటలైనా సరిగా వినిపించుకోకుండా తొందర తొందరగా నడచిపోతున్నది. అతడాపిల్లను మనసులో నిందించుకుంటూ ప్రాణాలన్నీ నీటిమీద పెట్టుకొని నడుస్తున్నాడు

ఇంతలో రోడ్డుప్రక్క మాగాణి అడ్డదారిగుండా ఒక శాటసారి, ముప్పయి యేళ్ళుంటవి. సామాన్యమైన బట్టలు, చేతిలో ట్రంకుపెట్టెతో వచ్చేవాళ్ళను కలుసుకుని "బుల్లెమ్మా! ఏ వూరువిూది" అని ఆ అమ్మాయిని అడిగాడు

అతనిచూపులు అంత మండుటెండలో ఆ అమ్మాయికి చల్లనిగాలి సోకినట్లు "నంబూరన్నా మాది" అన్నది

"ఇంత ప్రొద్దెక్కి వెళుతున్నావేమమ్మా బస్తీకి?" అన్నాడతడు

"అవునన్నా! మా అత్త ప్రొద్దున్నే బస్తీ వెళ్ళింది ఇంటిపనులు చూసుకుని బయలుదేరాను" అన్నది

"అబ్బ! ఏమి యెండ! అందులో వేడివేడి అన్నం తిని బయలుదేరాను దాహం నాలుక పిరిచివేస్తున్నది. ఇక్కడెక్కడైనా మంచినీళ్లు దొరుకుతయ్యా బుల్లెమ్మా?" అన్నాడు

"దగ్గరలో యెక్కడా నీళ్ళు దొరకవు. అట్లయితే యిందన్నా, తాగు" అంటూ గంపలో పెరుగుముంత తీసి అతని కివ్వబోయింది

అతడు ముఖమాటపడుతూ "వద్దులే తల్లీ! కొంత దూరంపోతే మంచినీళ్ళు దొరుకుతయ్యేమో" అన్నాడు.

"అయ్యో! అన్నా నీకెంత దాహంవేస్తున్నదో పాపం! సందేహించబోకు" అంటూ పెరుగుముంత అతని కిచ్చింది.

ఇదంతా వెనక జోగురుమంటూ నడుస్తున్న యువకుడు చూస్తున్నాడు. ఇంతలో రోడ్డుప్రక్క పొలంలో ఒకకుంట తగిలింది. అందులో నీళ్ళు యింకిపోయి అడుగున బురదలుగా కాసిని నీళ్ళుండి దాని నిండా కప్పలు తేలియాడు తున్నవి—అతడు ఆ యువతిని సమీపించి "నే నడిగితే వీల్లేదంటివిగా! పల్లెటూరి మడ్డిరకం" అని రెండో సూర్యునిలా మండిపడుతూ ఆ కుంట వైపుకు పరుగు పెట్టాడు.

# సృష్టి తేడా

భద్రయ్య భార్యతో బయలుదేరడం అదే ప్రథమం. వాళ్ళ పెళ్ళికి దంపతులిద్దరూ కలిసి ఏ నలుగురికళ్ళా పడ్డారో అంతే! అప్పుడుగూడా అతడు ఊరేగడానికి వప్పుకోలేదు. పెండ్లికూతురి తరపు వారి బలవంతాన వప్పుకోక తప్పింది కాదు నూతన దంపతులిద్దరూ పల్లకీలో కూర్చున్నారు. బోయీలు పల్లకీ యెత్తారు. పెండ్లికొడుకు వైపు మోస్తున్న బోయీలు సణుగుతున్నారు. పెండ్లికూతురువైపు యెత్తు కున్న వాళ్ళు నసుగుతున్నారు. పెండ్లికొడుకు, వాళ్ళబాధ చూడలేక తన వైపువున్న బోయీలకు రెండురూపాయిలు అందించాడు గూడా. ఎట్లయితేనేం అందలం అతికష్టంమీద ఓ బజారు తిరిగి రెండో బజారు ప్రవేసించేటప్పటికల్లా ఫెళ ఫెళ మన్నది. దంపతులకేమీ మొప్పంరాకుండా పల్లకీదింపి ఇద్దర్నీ కాలినడకనే ఇంటికి తీసుకవచ్చారు. పల్లకీ విరిగినా అంతటితో వాళ్ళబాధ తప్పిపోయి నందుకు మాత్రం బోయీలు మిక్కిలి సంతోషించారు. అప్పట్నుంచీ ఈ పదేళ్ళుచెల్లుగా దంపతులిద్దరూ కలిసి బయలుదేరడానికి ఇదే ప్రథమ ప్రయత్నం.

భర్త ఎంత లావుగావుంటాడో భార్య అంత సన్నగా వుంటుంది. ఇద్దరూ ఒకచోట ఉండగా చూసినవాళ్ళు భార్యా శరీరాన్నికూడా తానే ధరించాడా! అన్నట్టు తోస్తుంది. పూర్వం శివుణ్ణి అర్థనారీశ్వరుడని వర్ణించారు

చరిత్రకారులు. ఇప్పుడు పగటివేషగాళ్ళు వేస్తున్నట్టు శివుడు సగం స్త్రీగానూ, సగం పురుషుడుగానూ వున్నాడనడం కేవలం అబద్ధం. అసంభవం. మన భద్రయ్యలాగానే శివుడుగూడా లావుగా వుండివుంటాడు. అతని భార్యలాగానే పార్వతిగూడా సన్నగా వుండివుంటుంది. అతనివద్ద వెండికొండ వుండడంచేత చరిత్రకారులు పొగిడివుంటారు. యిది నిజం. యిప్పుడు భద్రయ్యదగ్గర డబ్బున్నా సరియయిన చరిత్రకారులు లేని లోపంవల్ల పైకిరాకుండా అలా డింత అన్యాయమై పోయింది పోగా! పైగా కస్సు పాకులోకం: క్రీంరమ్యం చెడుగాగ...కార్పరుం డెన్నిసుధీగుణంబు మరితా రూపంబు జేయుగాగదా' అని భర్తృహరి చెప్పినట్టు అతని కాయసంపదను చూసి సహించలేక ఏనుగుపిల్ల, డబ్బా, రోలర్, శాంకు మొదలైన దుష్టనామాలు తగిలించింది.

అదీ ఇవ్వాళ్ళయినా భార్య బలవంతాన బయలుదేరాడు కృష్ణాస్నానానికి. భద్రయ్యకు శరీరభారం తప్ప దైవకృపవల్ల సంతానభారం ఏమీ లేకపోవడంవల్ల విడిగా ఇద్దరూ స్టేషను చేరుకుని బెజవాడకు టిక్కెట్లు కొనుక్కుని రైలెక్కారు. భార్యను ఒకచోట కూర్చోబెట్టి తానొక బల్లమీద కూర్చున్నాడు. వాళ్ళిద్దరూ భార్యాభర్తలని అనుకోకుండా వుండాలని అతని వూహ. అయినా సన్నటి పదార్థాన్ని దగ్గర పెట్టుకుని తన ఆకారం పెద్దదిగా కనపడడానికి ఎలా దోహదం చేస్తాడు మరి ?

అతనిభార్య సరసనకూర్చున్న ఒక శత వృద్ధురాలు "ఏవూరమ్మాయ్ మీది? ఎక్కడికి వెళ్లుతున్నారు?" అంది.

"బెజవాడ కృష్ణా స్నానానికి వెళుతున్నాము" అంది భద్రయ్య భార్య.

"అట్లాగా నేనూ కృష్ణా స్నానానికే తల్లి!" సంతోషంతో అన్నది వృద్ధురాలు.

ముసలవాళ్ళు ఒక్క మాటతో సరిపెట్టుకోరుగా! ఒక నిమిషం ఆగి "భార్యా భర్తలిద్దరూ వస్తున్నారుగా అమ్మా" అంది వృద్ధురాలు.

"అవును అవ్వా" అన్నది ఆమె.

"అబ్బాయి ఏడీ ఎక్కడ కూర్చున్నాడు'? అన్నది వృద్ధురాలు.

ఆమెకు తన భర్తంటే ఎంతో భక్తి, ఎంతో గౌరవం. ఆమె కతడు కుంచెవిప్పిన నెమలిలాగా మనోజ్ఞంగా కనిపిస్తాడు. ఆమె కళ్ళ కతడొక నవమన్మధుడు "అడుగో అవ్వా" అని తనభర్త కూర్చున్నవైపు చేత్తో చూపించింది సగర్వంగా. కంటినిండా కనిపించాడు భద్రయ్య. ముసలమ్మకు ఎంతో ఆనందంవేసింది. "నీ భాగ్యమేమమ్మా" అంటూ భద్రయ్య దగ్గరకువెళ్ళి "ఏ అమ్మ గన్నదిరా నిన్ను నా తండ్రీ; ఏ తల్లికడుపు పవిత్రంచేశావురా నాయనా! నిన్నుచూస్తే నాకడుపు నిండినట్టుంది. మా అన్నయ్య

కొడుకొక డుండేవాడు అంతా నీరూపే నందివాహనంలాగా అరుగుమీద కూర్చుంటే చూస్తానికి నాకెంతో ముచ్చట వేసేది అటువంటి విగ్రహం ఇప్పుడెక్కడ చూద్దామన్నా కనిపించదు. ఎవర్ని చూసినా క్షయరోగం వచ్చినట్లు ఎండుకుపోయి, చప్పి దవడలుపడి కనిపించేవాళ్ళే! కళ్ళపండగ్గా ఇవ్వాళనువ్వు నాకు కనిపించావునాయనా! నీ తల్లి కడుపు చల్లగా నూరేళ్ళు వర్ధిల్లు బాబూ'' అంటూ అతని చెక్కిళ్ళునిమిరి ముద్దుపెట్టుకుంది.

భద్రయ్య చిన్నపొయ్యాడు ఆమె అన్నమాటలకు ఆనందించాలో కోపపడాలో అతనికి తెలియలేదు. ఈ ముసిలిదాన్ని నామీదికి పంపావేం? అన్నట్టు భార్యకేసి మాత్రం ముఖం చిట్లించుకుని చూశాడు.

బండి బెజవాడ చేరింది. దంపతులిద్దరూ వంతెన దాటారు గుర్రంబండివాళ్ళు ఊళ్ళోకి మనిషికి బేడా అని కేకలు వేస్తున్నారు. భద్రయ్య ఒక బండిని సమీపించి "వూళ్ళోకి వస్తావా'' అని అడిగాడు. వాడు "నీకీ పావలా ఆంకీ బేడా!'' అన్నాడు. ఆ మాట భద్రయ్య హృదయానికి శూలంవలె గుచ్చుకుని అంతశరీరం గూడా బాధపడ్డది. ఐనా భద్రయ్య వాడిని రెచ్చగొట్టి రద్ది చేసుకోదలుచుకోలేదు. బేరమాడకుండానే ఇద్దరూ బండిఎక్కారు. బండి సాగింది. భద్రయ్య ఇష్టప్రకారమేమీ నెరవేరలేదు. ఇద్దరూ ఒకచోట కూర్చోక తప్పిందికాదు. ఇది పరీక్షా సమయంగా తోచిందతనికి. భార్య తన సరసనకూర్చుంటే

ఏనుగు ముందు మేకపిల్లలాగా, గద్దముందు పిచ్చికలాగా, గండు చీమముందు యర్రచీమలాగా ఉన్నది. అంతా తమనే చూస్తున్నట్టనిపించింది. అతనిమనస్సుకు చాలాకష్టం తోచింది. ఎంతోమంది స్త్రీ పురుషులు బళ్ళమీదా, కాలి నడకనా వెళ్లిపోతున్నారు. వాళ్ళంతా ఎంత సన్నగా ఎంత అందంగా ఉన్నారు? వాళ్లు పూర్వజన్మలో ఎంత పుణ్యం చేసుకున్నారో! క్షయరోగం వస్తే సన్నపడతారంటారు. అదన్నారాదేం? ఓయి భగవానుడా! ఏనుగులనూ, కొండ చిలువలనూ, తిమింగలాలనూ, నిప్పుకోళ్లనూ, వంచకుడు మచ్చుమందుచల్లి మైదుచేసినట్టు నువ్వు వాటికి జ్ఞానం లేకుండాచేసి అంతలావునచేసి వేశావు సరే! అన్ని జ్ఞానాలు ఇచ్చి కూడా నన్ను ఇట్లా చేశావు. ఇదేమి దురన్యాయం? పాపం! ఆ జీవరాసులు తమశరీరాలను మోయలేక మనసులో నిన్నెంత తిడుతున్నయ్యో!

బండిమలుపు తిరిగింది. ఇది కలియుగం ఐపోయింది గానీ యే త్రేతాయుగమో ఐనట్లయితే భద్రయ్య దేవుణ్ణి శపించి ఉండేవాడే. బండి మళ్ళా జనసమ్మర్థంలోపోతున్నది. భద్రయ్య ఖేదానికి అంతులేదు. పాడు మానవులు సుందర మైన సౌధాలనూ, మనోహరమైన దృశ్యాలనూ. కూల్చేటందుకు సాధనాలు కనిపెట్టారుగానీ అసహ్యం వేస్తున్న ఈ పూబశరీరాన్ని ధ్వంసంచేసేటందుకు సాధనాలు కనిపెట్టలేదు. ఛీ! బ్రతికి ఏమిప్రయోజనం? చచ్చి మళ్ళీ పుట్టవచ్చునని అతనిమనస్సు పరిపరివిధాలుగా పోయింది.

జీవితంమీాద విర క్తిపుట్టింది. శరీరం అంటే తృణ ప్రాయంగా తోచిందతనికి. ఇంతలో బండి నదివద్దకు చేరింది. బాడుగయిచ్చి శరీరాన్ని మెట్లమీాదుగా నదివద్దుకు చేర వేస్తున్నాడు భద్రయ్య. దారిపొడుగునా ఒకటే బిక్షుగాళ్లు. భద్రయ్య మనస్సు అసలే స్తిమితం లేకుండావుంటే ఏం ధర్మంచేస్తాడు? "మనిషినిచూాస్తే కడుపు నిండుతుంది. దానాధర్మంలేదా?" మళ్ళీ ఈ దుష్టవాక్యాలు అతని చెవులపడ్డవి. అయినా నిండా మునిగినవాడికి చలేమిటి? ఆ మాటలు వినిపించుకోకుండా వాళ్ళనుదాటి నదిదగ్గరకు చేరుకున్నారు దంపతులు. ఆనాడు పరవడి దినంఅవటంవల్ల అక్కడ జనం కోలాహలంగా వున్నది. వేలకొలది ప్రజలు స్నానాలు చేస్తున్నారు. భార్యలని తెలియకుండా వుండాలని నటించేభర్తలూా, భర్తలని తెలియకుండా ఉండాలని చూసే భార్యలూా, దొంగలంతా అక్కడ చిక్కారు బ్రహ్మముళ్లు వేసుకోవడంవల్ల భార్యా భర్తలెవరో చప్పున తెలుస్తూ వుంది.

ఒక అబ్బాయి సన్నగా వగుడాకులాగా ఉన్నాడు. ఆయన సతీమణి నాలుగయిదు చతురపుగజాల నేలకు నీడను ప్రసాదిస్తూవుంది. వాళ్ళిద్దరూా బ్రహ్మముళ్లు వేసుకుంటే భర్తనడుముకు ఒకరోలు కట్టుకున్నట్టుంది. ఒక యువకుడు తాడిప్రమాణం ఉన్నాడు. ఆయన భామామణి అతని నడుమువరకు మాత్రం వున్నది. ఆ పైన జంటఖాళీ! భర్తమాత్రం చువ్వలాగా కనిపిస్తున్నాడు. ఒకఅమ్మాయి

యర్రగా అందంగా వున్నది. ఆమె ప్రాణనాథుడు నల్లగా వికారంగా చీకట్లు విరజిమ్ముతున్నాడు. అక్కడ జనాన్నంతా వర్ణించాలంటే ఎన్ని పేజీలు చాలుతవి? మొత్తం మీద వక్క మాటలో చెప్పి వెయ్యాలంటే డబ్బురాని ఫిలింలో బొమ్మల్లాగా ఉన్నారంతా. కాకులూ, హంసలూ వాలిన సరోవరంలాగా వుంది నదీతీరమంతా. గచ్చపొదలూ, గులాబీలూ మొలిచిన వనంలాగా వుంది ఆ ప్రదేశమంతా. యింకా సూటిగా చెప్పాలంటే లేళ్ళూ, లొట్టిపిట్టలూ కలిసిన మందలాగా వుంది ఆ జనమంతా. నదివడ్డున వాళ్ళందర్నీ చూస్తే సముద్రాన్ని మథించడానికి వచ్చిన దేవాసురులను గుర్తుకు తెస్తున్నారంటే అతిశయోక్తి ఎంత మాత్రం కాదు.

భద్రయ్య వాళ్ళందర్నీ తేరిపారచూశాడు. తనకు అన్నలు, తమ్ములు, అక్కలు, చెల్లెళ్ళు చాలామంది కని పించారు. పదిమందితోటి చావు ఒక పెండ్లితో సమాన మన్నారు పెద్దలు. అతని హృదయం తేలికపడ్డది. ముఖం వికాసవంతమైంది. అప్పుడు ఆ మిథునసమూహం మధ్య తమజంటను చూసుకుంటే తనకే అందం వేసింది. ఎంతో సంతోషంతో బ్రాహ్మడిచేతులో ఒక అర్ధ పెట్టి యిద్దరికీ బ్రహ్మముళ్లు వెయ్యమన్నాడు భద్రయ్య.



# పుణ్యాత్మురాలు

సత్రంలో భోజనాలుచేసి ఇద్దరూ సత్రం వరండాలో కూర్చున్నారు. దమ్ము, గుమ్ముగా వుండడంవల్ల చేతులో 'చిలుం రెండో సాధుకిచ్చి అతడు చెప్పాడు.

ఇది జరిగి దాదాపు రెండేళ్ళవుతుంది. అప్పుడు నాకు బెజవాడలో తెలిసింది రేపేనని. ఆ భోజనం తలుచుకుంటే నోరూరింది. అదివరకు ఒకసారి అక్కడ భోంచేశాను. మీకు తెలుసునో లేదో నారాయణమ్మగారు గొప్ప భక్తురాలు. ధర్మాత్మురాలు. ప్రతియేటా సాధుసంతర్పణ చేసి వచ్చిన బీదలందరికీ వస్త్రదానం చేస్తుంది. పరమ నైష్ఠికురాలు. అతిథిగా యతి దొరకనినాడు గంగ ముట్టదు. ఆమెగారంటే చాలదూరం ప్రశస్తి.

రెండో సాధు మౌనం వహించి ఆలకిస్తున్నాడు.

అప్పుడు నాకు వంటిమీద బట్టలుకూడా చినిగి పోయినవి. బట్టలు దొరుకుతవని కూడా సంతోషించాను. పదిమంది సాధులం కాలినడకనే లక్ష్మీపురం బయలు దేరాం. దారిలో అక్కడకు జట్లుజట్లుగా పోతున్న జనం చాలామంది కనిపించారు. అందరం కలిసి రామనామం చేసుకుంటూ ఆ గ్రామం చేరేటప్పటికి పగలు పదకొండు గంటలయింది. ఆ పై రోజల్లా అన్నంలేక పోవడంచేత నాకు తీవ్రంగా ఆకలి వేస్తూవుంది. కమ్మటి భోజనం

దొరక నున్నది గాన ఎంత ఆకలి వేసినా సంతోషంగానే వున్నది. అక్కడ భోజనాలు మిగిలిపోతయ్యేమోనని త్వరత్వరగా మేమందరం నారాయణమ్మగారి యిల్లు చేరుకున్నాం. అప్పుడే వీధినిండాజనం బారులుతీరి కూర్చుని వుంది. మేము యాభయిమందికై వుంటాం. మాకెక్కడా స్థలం కనిపించలా. వారి వాకిటి ముందే నిలబడ్డాం. ఇంతలో నారాయణమ్మగారు బయటికి వచ్చారు. ఆమెను చూడగానే నాకు భక్తి ఉదయించింది. ఆ మహాతల్లికి ఒక నమస్కారం చేస్తే చాలదు? పాపాలన్నీ పటాపంచలై పోతవి అనుకున్నా.

రెంకో సాధు ముఖంలో మందహాస రేఖలు పొడ చూపినవి.

మమ్మల్ని ఆమెగారు చూసింది. తలనిండా జడలూ గడ్డాలూ అందరం స్వచ్ఛమైన సాధులం. ఆమెకు కళ్ళ పండగ అయింది. ఆమె ముఖంలో వినయం ఉట్టిపడింది. భక్తి తాండవించింది. మమ్మల్నందర్నీ సగౌరవంగా లోనికి తీసుకువెళ్ళి హాల్లో కూర్చోపెట్టింది. అక్కడ రెండు బేళ్ళు పగలగొట్టి కొంతమంది బట్టలను చించుతున్నారు. ఆమెగారు మా అందరి కాళ్లూ కడిగి నెత్తిన చల్లుకుని పూజించింది. ఆ తల్లి మాకు చేసిన సపర్యలు అంతా ఇంతా అని కాదు. వద్దన్నకొద్దీ ఎన్నో రకాల భక్ష్యాలు వడ్డించింది. చెయ్యి అడ్డంపెట్టిన కొద్దీ గిన్నెలతో నెయ్యి తెచ్చి వడ్డించింది. యిన్ని సంవత్సరాలైనా ఆ భోజనం

ఇప్పటికీ నాకు మరుపురాదు. భోజనాలైనవి; లేచాం భుక్తాయాసంతో మే మందరం తొంగ చాపలమీద కూర్చున్నాం. ఆమె ఐశ్వర్యం, ఆమె సుగుణ సంపత్తి తలపుకొస్తున్నవి. ఇటువంటి పుణ్యవంతులు ఉండబట్టే లోకంలో జరుగుతూవున్న పాపాలకు భూదేవి తల్లి కుంగి పోకుండా నిలిచివుంది అనుకున్నా. ఏవో కేకలు వినబడి ద్వారంగుండా లోపలికి తొంగి చూశాను. నారాయణమ్మ గారు "ఇంత దొంగతనమా నువ్వు చేసేది" అంటూ ఒక స్త్రీని జుట్టుపట్టుకుని కొడుతూవున్నారు. ఆ స్త్రీ చింపిరి తలతో బక్కచిక్కి వున్నది. ముఖంచూస్తే బిచ్చపు కళ.

రెంకో సాధు ముఖంలో విషాదచ్ఛాయలు అలుము కున్నవి.

భోజనానికి వచ్చిన బిచ్చపు దెవతో యింట్లో జొరబడి ఏ వగో, నాణెమో దొంగతనం చేసిం దనుకున్నా. ఉపకారానికి పోతే అపకారమా—అడుక్కుతినే వాళ్ళంటే నాకు పరమ అసహ్యం వేసింది. ఆ పనికి నాలో నేను సిగ్గుపడ్డాను. ఆ మహాతల్లికి అంతకోపం తెప్పించిన పాపాత్మురాలిపైన నాకు కూడా కోపం వచ్చింది.

"రాత్రి అన్నం తినబోతే అన్నీ మాడు చెక్కలే. ఆకలికి ఆగలేక అవే తిందామని పెట్టుకుంటే నోరు కొట్టుకు వెళ్ళింది. తినలేక అంతటితో లేచాను. తెల్లవారికి కళ్ళు తిరుగుతున్నై. అందులో చాకిరీ చెయ్యవలసి వచ్చె.

వాటిని చూసి నా మనస్సును ఆపుకోలేక పోయ్యాను. తిన్నమాట నిజమే" అంటూ దీనంగాచూస్తున్నదా స్త్రీ.

సరే బిచ్చపుది కాదనీ, పోయినవి నగలూ, నాణాలూ కావనీ తేలింది. పనిమనిషిపై వుంటుందని నిశ్చయించాను. ఎంత యింట్లో పనిచేస్తుంటే మాత్రం చొరవయిచ్చారు గదా అని యజమాని ఆజ్ఞ లేకుండా ఇంట్లో జొరబడి తినడమే! ఇవాళ చిన్న దొంగతనమైంది. రేపు పెద్ద దవుతుంది అనుకున్నా.

కాస్త దూరంలో బిక్క మొగం వేసుకుని ఒక కుర్రాడు నిలబడి వున్నాడు-కుర్రాడేం దాదాపు మీావయస్సు వుంటుంది. చెయ్యూపి అతన్ని యివతలికి పిలిచి ఆమని ఎవరని మెల్లిగా అడిగాను. "అది నా భార్య, ఆమె నా తల్లి. తల్లిగాదు శక్తి. రెండు కజ్జికాయలు తిందిట. అదీ తప్పా" అన్నాడు మెల్లిగా శబ్దం అవతలకు పోకుండా. కోడలని తెలుసుకున్నాక నాకు ఆశ్చర్యం వేసింది.

రెండో సాధు రెండు కన్నీటిబొట్లు రాల్చి అన్నాడు: "ఆ నిర్భాగ్యుణ్ణి నేనే స్వామీ.—నా భార్య ఆమె పెట్టే బాధలకు క్షీణించి క్షీణించి వెళ్ళిపోయింది. పుణ్యాత్మురాలు తప్పక స్వర్గానికెళ్ళి వుంటుంది" అని నిట్టూర్పు విడిచాడు.

